# కృష్ణశాస్త్రి

## ధనుర్దాసు
## శ్రవ్య నాటికలు
## (భక్తిరసాత్మకములు)

ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్

రిజిస్టర్డ్ కార్యాలయం
3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర.)

ఇతర కార్యాలయాలు
కామాని మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038
17 చిత్తరంజన్ అవెన్యూ, కలకత్తా 700 072
160 అన్నాసలాయి, మద్రాసు 600 002
1/12 అసఫ్ అలీ రోడ్డు, క్రొత్తఢిల్లీ 110 002
80/1 మహాత్మాగాంధీ రోడ్డు, బెంగుళూరు 560 001
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029
బిర్లా మందిర్ రోడ్డు, పాట్నా 800 004
28/31, 15, అశోక్ మార్గ్, లక్నో 226 001
ఎస్.సి. గోస్వామి రోడ్డు, పాన్ బజార్, గౌహతి 781 001
205-ఎ, షహీద్ నగర్, భువనేశ్వర్ 751 007.

© ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్, 1993
ISBN 0 86125 952 1

ప్రచురణ
ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్,
3-6-2172, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

టైప్‌సెట్
కిరణ్ గ్రాఫిక్ సర్వీసెస్, న్యూ బాకారం, హైదరాబాద్ 500 020.

ముద్రణ

ట్విన్ సిటీస్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, హైదరాబాద్-29.

శ్రీ పి.వి. రాజమన్నారుగారికి

మీరు  సంపాదించిన 'కళ' పత్రిక నాటిది
ఈ బంధం : మీ రసజ్ఞత, మీ ప్రతిభ,
మీ ఉదాత్త సంస్కారమూ
ఏనాడో నన్ను ఆకర్షించాయి.
అప్పుడు మీకు ఇచ్చిన 'నాటికలు' ఇవి-
'ధనుర్దాసు' మొదలైనవి !

# నా మాట

1

ఏ నాటివో ఈ నాటికలు !
ఎప్పటివో గాని ఈ పద్యాలూ, పాటలూ
ప్రసంగ వ్యాసాలూనూ!
ఎప్పుడెపుడో గిలికినవీ బరికినవీని.
దూరాన నుంచి వెన్నంటి వచ్చాయి, ఎవరో చిరపరిచితుడైన
బాటసారి పదధ్వనులు లాగున – నన్ను వదలకుండా !

2

మా అన్నగారు శ్రీ శివశంకరస్వాములు నా 'కృష్ణపక్షము' 1925 లో అచ్చు వేయించేసేరు. అప్పటికి ఆయనకు అందిన నా పద్యాలన్నీ – కొన్నిటిని వదలివేయాలని నేనంటున్నా వినక– ఒక ధోరణిలో కూర్చి, తమ సింహావలోకనంతో ముద్రింపించేసేరు. 50 ఏళ్ళు అయింది. అలాగే నా సోదరుడు ముద్దుకృష్ణ 'ప్రవాసము– ఊర్వశి' అనే గ్రంథాన్నిని – 1929లో. ఎవరో ఒకరు తామే పట్టు పట్టి పూనుకుని చేయించాలి, నా చేత ఏ మంచిపని అయినా.

దాదాపు పాతిక సంవత్సరాలక్రితం ప్రారంభం – నా రచనలు అచ్చువేయించి తీరాలని ఆప్తులు ఒత్తిడి చేయడం. ప్రాణాధికులైన కాటూరి వేంకటేశ్వరరావు, మరి పాలగుమ్మి పద్మరాజు, ఎస్.బి.పి. పట్టాభిరామారావు, ఎమ్.ఆర్. అప్పారావు, నార్ల వేంకటేశ్వర రావు మొదలైనవారు – అచ్చుకాని నా రచనలన్నీ పుస్తకరూపాన ప్రకటించాలంటూ గట్టిగా పట్టుకునేవారు. ఇక నా ఆప్తమిత్రులు బెజవాడ గోపాలరెడ్డికి కనబడడం భయం– 'యేవండీ పుస్తకాలు?'

అని మొట్టమొదటి ప్రశ్న. అయినా పదుగురిలో వీనిని పడవేయడం పడలేదు.

3

ఏదో బెదరూ, భయం !
వల్లమాలిన బద్ధకమూ.
కొంతవరకు, జమీందారీ సావాసంవల్ల వచ్చిన ఉపేక్ష కూడాను.

తరుముకు వచ్చిన ఏ రేడియో ప్రోగ్రాంకో ఆ సమయానకు, గబగబ ఏ రజనీకాంతరావుకో, శివరామా రావుకో, కురిమెళ్ళ వేంకట రావుకో నేను చెప్తుంటే వ్రాసినవీ, లేదా ఏ ప్రయాణంలోనో, నడుస్తూనో చిన్నచిన్న కాగితాలమీద వంకర టింకరగా గీసినవీ రకరకాల రచనలు ఇవి.

మరి అచ్చు వేయించాలంటే తిరిగి ఒకసారి చదువుకోవాలి – సంస్కరించాలి– సాధ్యమైనంతవరకు ఏ లోపమూ లేకుండా నిర్మించాలి – ఇది నా సంకల్పం. పద్మరాజు నిర్మొగమాటి. ఖచ్చితంగా'ఇది బాగుంది, ఇది బాగా లేదు' అని చెప్పేస్తాడు–ఎవరి రచన అయినా సరే ! గొప్ప మేధావి, సాహిత్య రసవేత్త, రసజ్ఞుడు– అతగాడే వీనిని వేయమంటున్నాడే !

ఇంతలో మూగతనం వచ్చిపడింది నాకు.

Grow old along with me అని బ్రౌనింగు చాలా ఉల్లాసంగా అన్నప్పటికీ, ముసలితనం చెడ్డది.

ముసలితనంలో మూగతనం భయంకరం–శిథిలమందిరంలో అంధకారం లాగున.

ఏదో తోసేస్తున్నాను బ్రతుకు - 'దినములు పరస్పర ప్రతిధ్వనులుగాగ' - ఆనాటి మా వేదుల లాగున.

I am like the road in the night listening to the footfalls of its memories in silence అని రవీంద్రుడన్నట్లు-

'దీపకాంతిలో కిటికీ
దిగువ నెవ్వరా గోష్ఠి?
నేను - నా నీడ'

అని నళినీకాంతరావు అన్నట్లు.

4

ఇలా ఉండగా 1964లో నా ప్రాణమిత్రుడు దొడ్ల రామ చంద్రారెడ్డి హైదరాబాదు వచ్చి నా వచనరచనలు కొన్నిటిని తమ్ముడు ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి చదువుతుంటే విని, నావైపు చూడకుండా, వానిని అలాగే పట్టుకొనిపోయి, కావలిలోని విశ్వోదయ సంస్థ ద్వారా అచ్చు వేయించేసేడు - నాకు మాత్రం ఎందుకో నా వచన రచనలు నా పద్యాలకీ గేయాలకీ తీసిపోవు అనిపిస్తుంది.

అయితే, పద్యాలూ, ఎన్నో గేయాలూ, నాటికలూ, యక్షగానాలూ, వ్యాసాలూ ఉండిపోయాయి.

5

ఇంతలో ఒకాయన నా జీవితంలో ప్రవేశించాడు, చీకటింటి కిటికీలూ తలుపులూ తీసి వసంతకాలపు ప్రభాతవాయువు లాగున. ఈయన ఎవరిద్వారా విన్నాడో నా సంగతీ, నా రచనల సంగతీని:-

నాతో అనలేదు, నన్ను అడగలేదు – ప్రముఖులూ పెద్దలూ అయిన కొందరితో సంప్రతించి ఒకసంఘం ఏర్పరచాడు – నా ప్రియసోదరుడు మామిడిపూడి ఆనందం తనకన్నా ఉత్సాహంగా, పట్టుదలతో ఉన్నాడనీ – అంతే కాదు, నా పరమగురువులు వెంకటరంగయ్యగారు కూడా ఆదేశించారనీ, తమ యత్నాన్ని ఆశీర్వదించారనీ అన్నాడు.

ఈయన శ్రీ పి.వి.రమణయ్య– స్నేహితులం అందరమూ 'రాజా' అంటాము. 'నేనేమీ చదువుకోలేదు, నా కేమీ తెలియదు' అంటూంటాడు. అదేమో నాకు తెలియదుగాని, అతనికి ఒక వింత సంస్కారం ఉంది, అతని మూర్తికి సుకుమారమైన ఏదో పరిమళం వంటిది ఉంది; నన్ను చాలా గాఢంగా ఆకర్షించింది.

కాగితాలధర భయంకరంగా ఉన్న ఈ రోజులలో కొన్ని సంపుటాలకు సరిపోయే కాగితం కొని ముందే తెచ్చేశాడు. ఎవ్వరూ చేయని పని, చేయలేని పని ఈయన చేసేశాడు.

ఈయనకు మరొకరు తోడయ్యారు, అసాధ్యుడు, శ్రీ యం. యన్.రావుగారు, అచ్చు వేయించేభారం తనమీద వేసుకున్నాడు. అసలు, అచ్చుగాని తెనుగుగ్రంథం ఈయనకు అందడం భయం– ఎంత అభిమానం నా యెడ ఉంటే, ఎంత మక్కువ ఆంధ్రసాహిత్యం మీద ఉంటే, అంత పనుల ఒత్తిడిలో, ఈయన ఈ పనికి పూనుకుంటాడు!

ఇద్దరూ కలిసి నావద్ద ఉన్న రచనలను– చిత్తు కాగితాలనూ, చిల్లర పీలికలనూ– పట్టుకొని వెళ్లిపోయారు.

వీరికి ఎంత శ్రమకలిగించానో! కృతజ్ఞుణ్ణి అని వేరే చెప్పి వీరికి అన్యాయం చేయను.

మరి - రాజాక్కీ, యం.యన్. రావుగారికీ నాకూ మధ్య నళినికీ నాకూ మధ్య అసులో కండెలాగున తిరుగుతూ, మిత్రుడు శ్రీ ఆర్.కె.రావు, తన పనులన్నీ మానుకుని తెగ కష్టపడుతూ, నన్ను విశ్రాంతిగా ఉండనీయక తాను విశ్రాంతి తీసుకోక, బాకీ వసూలు చేసే కాబూలీ లాగున నన్ను పట్టుకుని ఈ పని అంతా నడిపిస్తున్నాడు.

శ్రీ చిరంజీవి నళినీకాంతరావు మహాకవి కుమారుడు. తానే మంచికవి, సాహిత్యవేత్త, బాగా చదువుకున్నవాడు- నా యెడ గాఢనురాగం అతనికి. నా మేనల్లుడు వింజమూరి శివరామారావు ప్రెస్సుకాపీలు తయారుచేసిపెట్టగా, తాను సంపాదకబాధ్యతలు పైన వేసుకొని, ప్రూఫులు తానే పట్టిపట్టిచూస్తూ, అవసరమైన మంచి దిద్దుబాట్లు చేస్తూ చెప్పలేనంత శ్రమపడుతున్నాడు.

ఈ గ్రంథాలకు ముఖచిత్రాలు వేసినవాడు నా కుమారుడు చి॥ బుజ్జాయి అనే సుబ్బరాయశాస్త్రి.

వీడూ, చిరంజీవి నళినీ నూరేళ్ళు హాయిగా వర్ధిల్లాలి.

వీరందరికీ-ఎందరికో- నా యెడ ఈ అకారణమైన

అనురాగం ఎందుకో !

అందరికీ కృతజ్ఞుణ్ణి.

కృష్ణశాస్త్రి

# ప్రశంస

"చిన్నన్న ద్విపద కెరగును
పన్నుగ పెద తిరుమలయ్య పదమున కెరగున్
మిన్నంది మొరయు నరసిం
గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్!"

అని చాటువుగా పలికిన తెనాలిరామకృష్ణుని నాటికే ద్విపదకు అధమ స్థానమూ, పదమూ లేక గేయానికి మధ్యమస్థానమూ, పద్యగద్య కవిత్వానికి 'మిన్నంది మొరయు' ఉత్తమస్థానమూ సాహితీపరుల హృదయాలలో నెలకొని ఉన్నాయి. తాళ్ళపాక అన్నమాచార్యులూ, ఆయన కుమారుడు పెద తిరుమలయ్యా అందుకొని ఎత్తి ఉండకపోతే గేయానికి వారికి ముందుకాలంలోలాగ మధ్యమస్థానం కూడా వచ్చి ఉండేది కాదేమో అనిపించడం సహజం. అలాగే ఆధునిక సాహితీపరులలో కూడా, పద్య గద్య కవిత్వానికి కంటె గేయకవితకు గౌరవం సాధారణంగా కొంత 'నాసి' అనే చెప్పాలి. పద్య గద్య కవితతోపాటు గేయకవితా ప్రక్రియను కూడా అవలంబించి గేయకవితకు కూడా అదే స్థాయిలో ఎత్తైన పీట వేయించుకున్న ఘనత చాలా కొద్ది మందికే దక్కుతుంది. ఆ కొద్దిమందిలో ఒకరు శ్రీ కృష్ణశాస్త్రి.

పద్య గద్య గేయాలతో కూడిన కృష్ణశాస్త్రిగారి నాటికా సంపుటాలు రెండు (గేయాత్మకముల దొకటే, భక్తిరసాత్మకముల

దొకటి) అసంఖ్యాకులయిన 'కృశా' సాహిత్య పిపాసువులకు ఇది శుభవార్త.

'రేడియో' అనేది పుట్టి ఉండకపోతే, అందులో మొదట తన అభిమానులూ స్నేహితులూ కార్యనిర్వాహకులుగా పనిచేస్తూ, తన చేత బలవంతాన రాయించి ఉండకపోతే తను అసలు నాటకాలు రాసి ఉండనేమో అని అంటూంటారు శాస్త్రిగారే. ఆయన స్వతహా ఉత్తమ శిల్పంలో కమ్మని పద్యాలు చెక్కగల ప్రథమశ్రేణికవులలో ఒకరు. నన్నయ శ్రీనాథాదుల నాటినుంచీ సానదేరి రూపుదిద్దుకొన్న తెలుగు పద్దెపు బాణీలు ఆయనకు కొట్టిన పిండి. ఆయనే ఒక Perfectionist కావడాన మంచిదో చెడ్డదో ఆయనకు ఒక గుణం ఉంది – ఎంత పెద్దగా పేరుమోసినకవి పద్యమైనా పాటయినా ఆయనముందు పెడితే, 'ఆమాట తీసివేసి ఈమాటవేస్తే ఆ పద్యం (లేదా పాట) అంతకంటే ఇంకా బాగుండేది'– అనడం. అందుకే తాను రాసినవికూడా ఏ పత్రికకో అచ్చుకు వెళ్ళేదాకా, లేదా, రేడియోలో గాలిలో వెళ్ళేదాకా లేక సినిమాలో రికార్డు అయేదాకా తనపాటలోనో పద్యంలోనో మాటలు ఏవో కొన్ని ఎక్కడో ఒక చోట మరి కాస్త దిద్ది తీరిస్తేగాని ఆయనకి తృప్తి ఉండదు – అంతెందుకు, ఇప్పటికి సిద్ధమయి ప్రచురణ కాబోతున్న పాటలూ పద్యాలూ, ఇంకా ఎక్కడో ఏదో దిద్దుకోవాలనే తాపత్రయమే ఆయన్ని తన రచనలను ఇన్నేళ్ళుగా పుస్తకరూపంలోకి తీసుకు రానివ్వలేదన్నా అతిశయోక్తి కాదు. అంత పెర్ఫెక్షనిస్టు గనకనే తాను రేడియోకి రాసిన పాటలకయితేయేం చివరికి సినిమాకి రాసిన పాటలకి కూడా ఉత్తమ కవితాగౌరవం దక్కించ గలిగినా రాయన.

ఈ పద్యం కృష్ణశాస్త్రిది, ఈ పాట కృష్ణశాస్త్రిది అని ఇట్టే పోల్చుకోవచ్చు. అవి ఆయన గేయనాటికలలో పులకాంకురాలతో పరవశించేసే ఘట్టాలుగా రూపొందాయి.

ఆ మాటల యెంపికలో ఉంది ఆ ముత్తుకూర్చే ప్రత్యేకత. ఆయన అసలు మాటకారి. ఎదటిమనిషినిగాని, సభనుగాని నిలబెట్టి అలా గంటలకొద్దీ మాటలాడుతూనే ఆకట్టుకునే స్వభావం. అప్పుడు ఆ ఆడేమాటలనే ఇప్పుడు పాపం, కాగితం మీద తెగ రాసేస్తూంటారు. స్నేహితులూ, బంధుగులూ, అభిమానులూ, శిష్యులూ ఆయనకు ఎప్పుడూ దగ్గరగా ఉండాలి. లేకపోతే తానే వెతుక్కుంటూ వాళ్ళదగ్గిరకి వెడతారు. అందుకే ఒకసారి నేనిలా అన్నాను ఆయన్ని గురించి –

“నీ తలపు వెలుగు క్రమము
నీ యెడద స్నేహసుధాపూర్ణ కనకసౌధవ్రమము
నీ యెలుగు శ్రావణాభ్రము
అచంచల కారుణ్య చంచలాప్త జలదశుభ్రము”–

అని, నన్నయ్యనుంచి నేటివరకూ అందరి కవుల అందమైన తెలుగు పలుకుబడులూ ఆయనకి సొంతం. అంతేకాదు, బామ్మ మాటలలో తాతయ్య ఊసులలో, పాటకపుజనుల పలుకుల్లో కూలివాళ్ళ కూతలలో ఇమిడి ఉన్న తెలుగుబాసకి జాత్యమయిన ప్రయోగాలను పట్టుకోడంలో ఆయన దిట్ట.

శర్మిష్ఠలో రాచకూతురి ప్రణయగీతలాస్యమూ, గుహుడిలో పడవవాని భక్తిపారవశ్యమూ, ‘ఏడాది పొడుగునా’ లోను ‘వేణుకుంజం’ లోనూ తెలుగు పల్లీజనపు జీవితమాధుర్యాన్ని ఉట్టిపడేట్లు చేసే నుడికారపు సొంపులూ–ఔచిత్యం చెడకుండా, చవకబారు అనిపించ

కుండా ఎంత అందంగా ఎంత ఉదాత్తంగా చెప్పారూ అన్నట్లుగా ఉంటాయి.

ఆయనకుపూర్వం ఎందరో గేయకర్తలున్నారు. ఆయనకు సమకాలికులూ తరువాతివారూ ఉన్నారు. కాని, ఆయనంతగా ఆలోచించి పరిశీలించి పరిశోధించి పాటకూర్చే రహస్యం, పాటకూర్పులోని అందాలను తెలుసుకున్నవారు చాలా తక్కువ. ఆయనా మొదటి ఖండకావ్యసంపుటాలలో మిశ్రఖండగతులలో సాగే మాత్రాగణాలతో నడిచే గేయాలను రాశారు. బ్రహ్మసమాజ ప్రార్థనలకోసం మహతి, కార్తికి అనే చిన్ని సంపుటాలలో రీతులను గతులను మార్చిమార్చి రాశారు. గాత్రం పోయేవరకూ ఆయన చేసే కవితాగానాలకు ఆంధ్రదేశం అన్నిపక్కలా సాహిత్యసభలు ఉర్రూతలూగేవి. తనవే కాదు, గురజాడనుంచి తనదాకా ఆధునిక కవు లందరి 'రచనలూ, నన్నయనుంచి తమ బాబయ్య, నాన్నగార్లదాకా పూర్వకవులందరి రచనలూ ఆ సభలలో మొదట గానమే చేసేవారు. గురజాడవారి ముత్యాలసరాలూ, పుత్తడిబొమ్మవంటి కథాపదాలూ (ballads), నండూరివారి యెంకిపాటలూ, బసవరాజా అప్పారావుగారిపాటలూ, అడివి బాపిరాజుగారి పాటలూ ఇవన్నీ సంగీతపు ఊపు అంటీఅంటని రచన అనిపిస్తాయి. కృష్ణశాస్త్రిగారి ఖండకావ్యాలలోని మాత్రాగణ గేయాలు కూడా సాహిత్యపరుల పాటలే. అంటే వాటిలోని కవితాభాగం ఎక్కువ బరువు- దానికి పెట్టే సంగీతం పైగా చేర్చుకున్న ఒక తొడుగుమాత్రం అవుతుంది. అవికాక, శాస్త్రిగారు ఆ తరువాత రాసిన గేయాలూ గేయనాటికలూ అనసూయ సీతలనో, రజనినో (నన్నో), శ్రీ పాలగుమ్మి విశ్వనాథమునో, మల్లి కుక్కనో దగ్గర కూర్చోబెట్టుకుని,

కొన్ని సందర్భాలకు తగిన సంగీతపువరుసలు పాడిస్తూ, ఆ వరుసలకు తగిన మాటలు కూరుస్తూ వ్రాసినవాటిలో గేయానికి కావలసిన సంగీతరచనలోని విశిష్టతా, సాహిత్యగౌరవమూ ఇవి రెండూ ఎలా ఉండితీరాలో అలా సమకూడుతూ వచ్చాయి. ఇలాటి రచనలన్నీ రేడియో ప్రారంభం అయాక వచ్చినవే. ఇప్పుడు సంపుటాలుగా వస్తున్న వాటిలోని వన్నీ అవే. వీటిలో సగానికి పైబడిన వాటితో నాకెంతో సన్నిహిత సంబంధం వుంది.

ఇవి వెలువడుతున్న సందర్భంలో ఈ పరిచయ ప్రశంసా వాక్యాలతో నా సంబంధాన్ని మరింత సన్నిహితం చేసుకొనే అవకాశం నాకిచ్చిన ప్రకాశకులకి నా కృతజ్ఞతలు.

రజని

ఇందులోని నాటికలు

ధనుర్దాసు

సాయుజ్యము

గుహుడు

శివక్షేత్రయాత్ర

పాత్రలు

శ్రీ భగవద్రామానుజులు

ధనుర్దాసు ... మల్లుడు

హేమాంగి ... ధనుర్దాసు భార్య

మాధవుడు ... ధనుర్దాసు సేవకుడు

పరాశరుడు ...
శ్రీనివాసుడు ...
చూడమ్మ ...
నాంచారమ్మ ...
సీనయ్య ...
} యాత్రికులు

విష్ణుచిత్తుడు ...
మారుతి ...
బాలార్యుడు ...
ఆంధ్రపూర్ణుడు ...
గోమఠార్యుడు ...
} శ్రీ రామానుజుల శిష్యులు

భజనకూటము – బిచ్చగాడు – సానిమేళము

# ధనుర్దాసు

### నాంది శ్లోకం

అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే !
వినత వివిధ భూతవ్రాత రక్షైక దీక్షే !
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే !
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా !

## మొదటి రంగము

(నిచుళాపురి అనే ఉరయూరు. ధనుర్దాసు ఇల్లు, ధనుర్దాసు పాడుకుంటూ ఉంటాడు.)

హేమాంగి : పాటల్లోకికూడా దిగిందీ పిచ్చి?

ధను : (పాడుతూన్నట్టు) హేమాంగి ఓ హేమాంగీ! హేమా! హేమా! హేమాంగీ! పలకదు పోనీలే!

హేమాంగి : (లోపలనుంచి) ఎలా పలుకుతుంది? ఒక్క చిటికలో అయిదారుసార్లు పిలిస్తే ఎవరు పలుకుతారు? అసలు అది పాటో పిలుపో నాకు తెలిస్తేనా?

ధను : పిలవకపోతే ఎలాగ? అంతసేపు అయింది లోపలకు వెళ్ళి !

హేమాంగి : అంతసేపూ? ఆఁ మరీని. అరగడియ అయినా అయిందో లేదో!

ధను : అలాగంటావేం? అరగడియ మాత్రం ఎందుకవాలి? హేమా! నన్ను చూడాలని నీకు ఉండదా? నీమీద నాకున్నంత ఇష్టం నామీద నీకు లేదు సుమా!

హేమాంగి : (గారాంగా) అలా అనవచ్చునా? పోనీ లెండి! అలా అంటారా! మీలాగ నేను పైకి వెర్రిగా ఉంటే బాగుంటుందా?

ధను : పోనీ అరగడియే అనుకో! నువ్వు ఎలా ఉండగలవు నన్ను చూడకుండా హేమా?

(ధనుర్దాసూ ధనుర్దాసూ అంటూ తలుపు కొట్టిన చప్పుడు)

హేమాంగి : (కిలకిల నవ్వుతూ) ఆ! బాగా అయింది. ఇప్పుడు మీరు ఎలాగ ఉండగలరో చూస్తాను.

ధను : ఆ పిలిచినవాడికి బుద్ధి లేకపోతే సరి! కంఠం పట్టుకొని ఒక్కసారి ఊపితే, కలవకాడలాగ కింద పడిపోతాడు తెలుసునా?

(అవతలనుంచి ధనుర్దాస్! ధనుర్దాసోయ్! అంటూ ఒకటే కేకలు)

ధను : అరేయ్! రా, లోపలికి రా! అరవకు, ఏమిట్రా తొందర మాధవా? ఊపిరాడక చస్తున్నావు!

మాధవ : కేరళం నుంచి ఆ మల్లుడు వచ్చాడు. అసాధ్యుడులాగ ఉన్నాడయ్యా! ఆరడుగు లుంటాడు. పెద్ద ఛాతీ, ఇనప స్తంభాల్లాంటి –

ధను : ఛా! ఊరుకో! ఈ సాయంకాలం ఏర్పాటు చెయ్యి. చెన్నప్పను పోటీ చెయ్యమను, మన శాలలోనే.

మాధవ : అలాగే! కాని –

ధను : ఫో ! (గట్టిగా అరుస్తాడు. భయపడి మాధవుడు ఒక్కటే పరుగు)

హేమాంగి : (నవ్వుతూ) అమ్మయ్యో! ఎంతకేక వేశారు! ఏమండీ! మాధవుడితో మాట్లాడుతూన్నప్పుడు కూడా నాకేసి చూసి మాట్లాడుతూంటే వాడు ఏమనుకుంటాడు?

ధను : వాడి మొహం అనుకుంటాడు – కోతి !

హేమాంగి : కాదండీ! ఒకటి ఆలోచించారా? అస్తమానమూ, ఎంత చక్కని వస్తువైనా, దానికేసే చూస్తూంటే బాగుంటుందా? ఇతర వస్తువుల మీద కూడా చూపులు వాల్తూ ఉండాలి. తరవాత దాన్ని చూస్తే మరీ చక్కగా ఉంటుంది.

(ధనుర్దాసూ! ధనుర్దాసూ! అని బైటకేకలు, హేమాంగి విరగబడి నవ్వుతుంది)

ధను : ఈమాటు వీడు నాచేతిలో చచ్చిపోతాడు. కొంగలాగ, కొంకినక్కలాగ, పదిసార్లకు తక్కువకాకుండా పిలుస్తూంటాడు ఈ మాదన్న. రా! రా! (గట్టిగా అరుస్తాడు)

మాధవ : మహారాష్ట్రం నుంచి వచ్చాడు – ఏనుగ! పెద్దకొండ! మాంచి ఒడుపుగా ఉన్నాడయ్యా ఈ మల్లుడు!

ధను : ఆగు! ఇక వర్ణించకు, వాడితో జట్టీగా మన మునెయ్యని ఏర్పాటు చెయ్యి! ఫో! ఇంకా పోవేం? ... (మాధవుడు పోతాడు) ..... హేమాంగీ!

హేమాంగి : (నవ్వుతూ) ఫో అనేటప్పటికి వాడు వీథిలో పడ్డాడు. ఏమండీ! ఈ మల్లు లందరితో మనవాళ్ళు పోట్లాడగలరా?

ధను : ఆ! ఆంధ్రదేశంలో మాత్రం ఒక డున్నాడు. వాడు వస్తే నేనే చెయ్యి కలపాలి.

హేమాంగి : ఇందరు మల్లు లెందుకు వచ్చారండీ ఇప్పుడు?

ధను : శ్రీరంగంలో చైత్రోత్సవానికి వెడుతూ ఇలా వచ్చారు.

హేమాంగి : నిజంగానా? నిజంగానా? (గారాంగా) ఏమండీ! నాకు ఒక కోరిక ఉంది. అలా చేస్తారా? ఒట్టే! ఊఁ అంటే చాలదు. (నవ్వుతూ) తల ఊపొద్దు. అలా ఊపితే నా కళ్ళకేసి చూడ్డం పోతుంది .... ఒట్టూ అని చేతిలో చెయ్యి వెయ్యాలి.

ధను : ఒట్టు! (చేతిలో చేయివేసిన చప్పుడు)

హేమాంగి : ష్ ష్ ష్! అబ్బా! గిల్లకండి! (బాధతో అన్నట్లు)

ధను : మాధవా! ఒరేయ్ మాదన్నా! మాదిగా!

హేమాంగి : పాపం! మీరు మాత్రం- పదిసార్లు పిలవరూ? (ఇద్దరూ నవ్వుతారు)

ధను : ఒరేయ్ మాధవా! శ్రీరంగానికి ప్రయాణం అవుతున్నాం.

మాధవ : మరి సాయంకాలం పోటీయో?

ధను : ఫో! ... పీనుగులాగ కాళ్లీడ్చుకుంటూ! నీ బుర్రకీ నీ ఉద్యోగానికీ సలహాకూడాను! ఏం మొహంరా!

(మాధవుడు వెళ్ళిన చప్పుడు. ధనుర్దాసు పాడలాడు. తరవాత హేమాంగీ ధనుర్దాసూ వెళ్ళిపోతారు.)

## రెండవ రంగము

(ఉత్సవంలోనూ ఊరేగింపులోనూలాగ జనం కోలాహలం. శ్రీరంగనాయక స్వాములు తిరువీథి వేంచేస్తున్నారు. దూరాన్నుంచి సుఖమైన నాగస్వరం, మేళతాళాల సందడి. ధనుర్దాసూ హేమాంగీ ఉత్సవంలో ప్రవేశిస్తారు. జట్టులు జట్టులు మాట్లాడుకుంటూ పోతారు.)

పరాశరుడు: ఒయ్యోయ్ శ్రీనివాసా! ఉత్సవం ఎంతదూరంలో ఉంది? ఏమి జనం! ఏమి జనం?

శ్రీనివాస : ఇదిగో పరాశరుడూ! ఉత్సవం మలువులోకి వచ్చిందయ్యా! అవును కానీ, ఆతగా డెవరు? ఆవిడ కళ్ళకేసి చూస్తూ ఆ గొడుగు వేయడ మేమిటి? కవిగారేమిటోయీ? ఉత్సవం దృష్టిఏమీ లేనట్టుంది!

పరాశరుడు : ధనుర్దాసని-ఉరయూరు, గొప్ప మల్లుడు. ఆవిడ అతని యిల్లాలో, ప్రియురాలో! హేమాంగి అట!

శ్రీనివాస : ఎవరైనా ఆ గొడుగు వేయడ మేమిటోయ్! కొంచెం, బుర్ర గానీ, కాస్త –

(అందరూ గొల్లున నవ్వుతారు)

చూడమ్మ : అయ్యో అయ్యో అయ్యో! వాళ్ళిద్దరికేసీ చూడమ్మా నాంచారమ్మా!

నాంచారి : చూడమ్మా! నువ్వే చూడమ్మా! ఆ చిలకా గోరువంకా కేసి!

చూడమ్మ : ఆయనగారు గొడుగు వేశాడనుకో! మగరాజా మరి! ఏం చేసినా చేస్తాడు. ఎంత గడితేరిందయినా, ఆ అమ్మికి సిగ్గుండాలి. ఈ నడివీథిలో ఈ కులుకులూ సింగారాలూ ఏమిటి? మనకి చూడ్డానికి ఎంత కష్టంగా ఉంటుంది చెప్పు! ఆ అమ్మికి సిగ్గుండాలి.

నాంచారి : అయ్యో నీ యిల్లు–ః ఇదేమి టమ్మోయ్! మధ్యని నీకెందుకు కష్టం? పాపం! ఆవిడ సిగ్గుపడుతున్నట్టే ఉంది. అయినా, చూడమ్మా, నీకేం జ్ఞాపకం వచ్చిందమ్మా?

(అందరూ గొల్లున నవ్వుతారు)

సీనయ్య : అయ్యయ్యయ్యో! మీదకొస్తారూ! అయ్యొ వుబలాటం! వుత్సవం వూరేగింపూ ఏమీ లేదేంటి? కాలు తొక్కేశాడు. గొడుగెట్టి కంట్లో పొడిశాడు. ఎందుకయ్యా ఈ గొడుగు ఈ యిరకాటంలో? బుద్ధిలేదూ? అమ్మయ్యో ఎంతతోపు తోశాడు!

(అందరూ గొల్లున నవ్వుతారు)

ధను : హేమాంగీ! అలా తల తిప్పకు!

నీ కనులపైని నాకేలి నీలిగొడుగు
నీడ, నీ మీదనో సమున్నిద్ర జాగ్ర
దస్మ దనురాగ సితశీత లాతపత్ర
మో సఖీ! ఇటునటు సుంత ఓసరిలకు!

హేమాంగి : ష్ ష్! ఇదేమిటండీ ఇక్కడ కూడా! ఎవరయినా నవ్వి పోతారు. ఆ భజన ఏ ఊరు దండీ?

శ్రీనివాస : కవే నయ్యోయ్! పాపం! అప్పుడే అనుకున్నాను.

పరాశరుడు : కాదయ్యా! ... భజన వస్తోంది.

భజన : *భూలోక వైకుంఠపురమునకు రావయ్య!*
*నీలోని రతనాల నిధులెల్ల తీవయ్య!*
*నీకొరకు నాకొరకు లోకు లందరికొరకు*
*వైకుంఠమే విడిచి వరదు డిట వేంచేసె!*
*॥భూలోక॥*

కావేరి ఊట పుష్కరిణి నీట మునింగి,
కోవెల పూవులా కోవ కూర్చి,
తావికన్నా మృదులతరమైన మనసుగల
దేవేరితో కొలువుదీర్చు హరి గొలువగా
*॥భూలోక॥*

హేమాంగి : ఆహా! ఏమి భక్తయ్యా మీది! ఏ ఊరు మీది?

ఒకడు : కళింగదేశం తల్లీ! మాది పిఠాపురమమ్మా!

(భజన వెళ్ళిపోతుంది)

హేమాంగి : వీళ్ళెవరండీ?

ధను : హేమా! ఈ గొడుగు కిందికి రా!

హేమాంగి : అబ్బ! పాపం! యాత్రకోసం ఎంతదూరాన్నుంచి వచ్చారో ఈ వితంతువులు!

(వితంతువులు పాడుతూ వస్తారు)

*కావేరి రంగరంగా నాయన్న! కస్తూరి రంగరంగా!*
*దేవేరి అయిన నీతో మామనవి తెలిపి రక్షింపలేదా?*
*సగముపోయిన ప్రాణమూ నాస్వామి! తగని దారుణ భారమూ!*
*అడుగిడగనే నేరమూ నాతండ్రి! అభయ మిడి కాపాడుమూ!*

*వైకుంఠ నగరి విడిచి, నాతండ్రి! లోకాల నెల్ల కడచి,*
*నా కంటి నీరు తుడిచి, చల్లగా సాకగా నిటు వస్తివే!*
*ఏలాటి కరుణ నీది, నాయన్న! నీలాటి దైవమేది?*
*నాపాటి దీనదీ, నాతండ్రి! ఈపాటకైన రాదే!*

హేమాంగి : ఆహా! ఎంత చల్లని పాట! ఏదేశ మమ్మా మీది?

ఒకతె : తెలంగాణం తల్లీ! ఓరుగల్లు, రామేశ్వరం వెడుతున్నాం.

ధను : హేమాంగీ! అలాగ దూరంగా వెడతావేం?

హేమాంగి : ఉండండి! గుడ్డివాడు- ముష్టివాడు. మంచి తత్వం పాడుతున్నాడు- వినండి!

(ముష్టివాడు పాడుతూ వస్తాడు)

పచ్చనాకుల దేని, పైడిదైనా గాని
పంజరపు బ్రతుకేల చిలుకా!
నిచ్చనిచ్చలు నీలి నీలిబయళుల వెల్గు
నిచ్చెనల నెక్కవే చిలుకా !
వైకుంఠపురములో విరజదరిలో విరుల
వన మొక్క టున్నదే చిలుకా !
ఆకులో అలరులో అణగిమణగీ ఒక్క
అమృత ఫలమున్నదే చిలుకా !

హేమాంగి : ఇందబ్బీ! పాపం! ఏ ఊరు?

బిచ్చగాడు : నాతల్లి నాతల్లి! కర్ణాటకం తల్లీ! కమలాపురం తల్లీ!

హేమాంగి : ఏమండీ! ఆ మేళం వస్తూంది చూశారా? దానిలో ఆవిణ్ణి చూడండి! స్వామిని చూసి ఎలా అభినయిస్తోందో! ఏ ఊరి మేళమో?

ఒకడు : కంచి నుంచి వచ్చింది– కామసుందరి మేళ మమ్మా!

(భోగంమేళం వస్తుంది– పాడుతూ)

ఈ యాడుజన్మము ఎత్తిన ఫల మేమి?
అతివరో వ్యర్థ మయ్యె !
వెలివిరిసి వస్త్రాలు వేయిగట్టిన నేమి?
సలలిత నవరత్న సరులు దాల్చిన నేమి?
సిస్తాగ పూవులు సింగారించిన నేమి?
కస్తూరి రంగనితో కలిసియుండకపోతె !

("వచ్చారు వచ్చారు! నా స్వామి దర్శన మిస్తున్నారు! ... గరుడాళ్వారు-గరుడాళ్వారు! ... ఈ వేళ సింహవాహనం కాదూ?.... నా తండ్రీ రంగా! రంగశాయీ! రంగనాథా! రంగయ్యా! రంగా! రంగా! ... ఆహా! అదుగో శ్రీ రామానుజాలు! యతిరాజాలు - భక్తులమధ్య ఉన్నారు! ఆహా! చుక్కల్లో చంద్రుడులాగ ఉన్నారు?" అని రకరకాల గొంతుకలతో కేకలు! ఇంతలో భాగవతులు ద్రవిడ ప్రబంధము పఠిస్తూ వస్తారు.)

కణ్ణాన్ కషళినై
నణ్ణుమ్ మనముడైయీార్
యెణ్ణుమ్ తిరునామమ్
తిణ్ణమ్ నారణమే

'పచ్చైమా మలైపోల్ మేనీ పవళవాయ్ కమల చెంగణ్
అచ్చుతా, అమర రేరే ఆయరదమ్ కొషుందే' యన్నుమ్
ఇచ్చువై తవిరయాన్ పోయి ఇందిరలోకమ్ ఆళుమ్
అచ్చువై పెరినుమ్ వేండేన్ అరంగమా నగరు ళానే

వండిన మురలుమ్ సోలై మైలినమ్ ఆలుమ్ సోలై
కొండల్ మీ దణవుమ్ సోలై కుయిలినమ్ కూవుం సోలై
అండర్‌కో నమరుమ్ సోలై అణి తిరువరంగ మెన్నా
మిండర్ పాయీాం దుణ్ణమ్ సోబ్రై
విలక్కినాయిక్ కిడుమి నీరే!

(కొంచెం వాద్యాలూ ఊరేగింపూ దూర మవుతాయి)

శ్రీ రామానుజాలు : విష్ణుచిత్తా!

విష్ణు చిత్త : ఆచార్యదేవులు ఏదో సెలవిస్తున్నారు!

శ్రీరామానుజాలు : ఆ తేజస్వి ఎవరు?

విష్ణు చిత్త : ఎవరు స్వామి ?

శ్రీరామానుజాలు : ఆ స్త్రీ నేత్రాలకు గొడుగుపట్టిన ఆతడు.

విష్ణు చిత్త : ధనుర్దాసని ఒక మల్లుడు.

మారుతి : ఉరయూరు ఆతనిది.

బాలార్యుడు : ఆమె హేమాంగి, అతని భార్యట !

ఆంధ్రపూర్ణుడు : అహరహోలు ఆమె కన్నులకేసి చూస్తూ, వాట్లని సేవిస్తూ ఉంటాడు. వాడు తేజస్వి ఏమిటి ప్రభూ?

మారుతి : తమరే అలాగ సెలవిస్తే ఎలాగ ?

బాలార్యుడు : వట్టి స్త్రీలోలుడు.

విష్ణు చిత్త : ఈ వెర్రివేషాలన్నీ శ్రీరంగనాయకుల సన్నిధానంలోనే కూడా!

శ్రీరామానుజాలు : విష్ణుచిత్తా! ఆంధ్రపూర్ణా! నాయనా బాలార్యా! ఏ తపస్వికోగాని సాధ్యంకాని ఆ యేకాగ్రత చూడండయా! మారుతీ! ఇప్పుడతడు స్త్రీ నేత్రాలకు దాసుడుకదా!

నేటి ప్రదోషసమయాన దివ్యనేత్రాలకు దానానుదాసు ఔతాడు. గోమతా! నీవు సాయంకాలం అతడు విడిదిచేసిన సత్రానికి పోయి, మేము కోరినట్లుగా, శ్రీరంగ దేవాలయానికి తీసుకొనిరా!

మారుతి : స్వామీ!

బాలార్యుడు : ప్రభూ !

విష్ణు చిత్త. : ఆచార్యా! వాడు వస్తాడా?

గోమతార్యుడు : ఆలయానికా ?

శ్రీరామానుజులు : తప్పక వస్తాడు. నాకు తెలుసునయ్యా! నాకు స్పష్టంగా గోచరిస్తూంది. ధనుర్దాసు పరమ భాగవతుడు. ఆహా! ఏమి రాగం! ఏమి దీక్ష! ఏమి ఏకాగ్రత! ధనుర్దాసు భాగవత శిరోమణి!

(సన్నాయి దూరంగా గెలిచినట్టు ఉద్రిక్తమై మ్రోగుతుంది)

## మూడవ రంగము

(ప్రదోష సమయం. దేవాలయం గంట మ్రోగుతుంది. శ్రీ రంగనాయకస్వామి ఆలయంలో, గర్భాలయంలో, దూరదూరాల ప్రపన్నులందరూ నిలబడి ఉండగా, శ్రీమద్రామానుజాచార్యులవారు భగవంతుని ధ్యానిస్తూ ఉంటారు.)

గోమత : రావయ్యా ధనుర్దాసూ! ఆలయంలోకి రా! సందేహిస్తా వెందుకు?

ధను : స్వామీ! మీ పేరేమిటి?

గోమత : గోమతార్యుడు.

ధను : తమరు శ్రీమద్రామానుజాల శిష్యులా?

గోమత : ఆ ప్రభువు పాదరేణువును.

ధను : అయ్యా! ఆచార్యదేవులు నన్నే రమ్మన్నారా?

గోమత : అవునయ్యా! వారి ఆనతి అయినది. ఏ భాగ్యశాలికో గాని కాదుకూడా! అలాగ సందేహిస్తా వెందుకు ధనుర్దాసూ?

ధను : స్వామీ! నేను రావాలా? ... హేమా! హేమాంగీ! నువ్వూ వస్తున్నావా? .. ఎందుకు స్వామీ ఆగంట అలాగే మ్రోగిస్తున్నారు? అయ్యా! వీరందరూ భక్తులే? ఆహా! ఈ సువాసన ఆలయంలో ధూపదీపాలదా? ... హేమాంగీ! నువ్వు నాతోగూడా ఉన్నావా? కూడా

ఉండూ! ... స్వామీ! వీరు శ్రీ రంగనాయకులకు చందనం తీస్తున్నారా? అబ్బా! ఎవరు కూర్చారో ఈ మాల్యాలు! గుట్టలు గుట్టలుగా ఎలా పోశారో! అయ్యా! ఈ ఘంటానాదమూ, ఈ సువాసనలూ, ఈ దీపాల కాంతీ కలిసిపోతున్నాయి ఎందుకు? స్వామీ! ఇన్నిదీపా లెందుకు?... హేమాంగీ! నా చెయ్యి వదలకు.. అబ్బా! ఏం తీర్థప్రజ! వీరందరూ భక్తులేనా స్వామీ? ... అదేనా గర్భాలయం? ఆహా!... వారు ... (సంకోచిస్తున్నట్లు).

**గోమత** : వారేనయ్యా ధనుర్దాసూ! శ్రీమద్రామానుజాలు !

(దూరాన్నుంచి ప్రారంభమై, అంతకంతకు దగ్గరగా వస్తూన్నట్టు, మేఘ గంభీరమైన కంఠస్వరంతో, రాగయుక్తంగా, శ్రీ యతిరాజాలు భగవంతుని కీర్తిస్తూంటారు.)

**శ్రీ రామానుజాలు** : భగవన్నారాయణ అభిమతానురూప స్వరూపరూపగుణ విభవైశ్వర్య శీలాద్యన వధిక అతిశయ అసంఖ్యేయ కల్యాణ గుణగణానామ్, పద్మవనాలయామ్, భగవతీమ్, శ్రియందేవీమ్, నిత్యానపాయి నీమ్, నిరవద్యామ్, దేవదేవ దివ్యమహి షీమ్, అఖిల జగన్మాతరమ్, అస్మన్మాతరమ్, అశరణ్యశరణ్యామ్, అనన్యశరణః శరణ మహం ప్రపద్యే! ... (ఒక్క చిటిక నిశ్శబ్దం)

ధను : (భయంతో, గుసగుసగా అన్నట్టు) ... అయ్యా నేనూ రానా! హేమాంగీ! రా!

శ్రీరామానుజులు : అఖిలహేయ ప్రత్యనీక కల్యాణైక తానస్వేతర సమస్త వస్తు విలక్షణానంత జ్ఞానానందైకస్వరూప స్వాభిమతానురూపైకరూప అచింత్య దివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశయ ఔజ్జ్వల్య సౌందర్య సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంత గుణనిధి దివ్యరూప స్వోచిత వివిధ విచిత్రానంతాశ్చర్య నిత్యనిరవద్య నిరతిశయ సుగంధ నిరతిశయ సుఖస్పర్శ నిరతిశయౌజ్జ్వల్య కిరీట మకుట చూడావతంస మకరకుండల గ్రైవేయక హార కేయూర కటక శ్రీవత్సకౌస్తుభ ముక్తా దామోదర బంధన పీతాంబర కాంచీగుణ నూపురాద్య పరిమిత దివ్యభూషణ, పరబ్రహ్మభూత పురుషోత్తమ వైకుంఠనాథ అనన్యశరణః త్వత్పాదారవిందయుగళమ్ శరణ మహం ప్రపద్యే! ... (అంతకంతకు శ్రీరామానుజులు పరవశులై పఠిస్తారు)... శ్రీమన్మహానర్ఘరత్నాయి తార్క్ష్యేందుతారాచ్ఛ టోదార మంజీర కేయూర కోటీర హారజ్వల

త్ఖండలాఖండ తీక్ష్ణచ్ఛవివ్యాపి తాశేష దిఙ్మండలా! (గంటలు గణగణా గణగణా మాటలు వినబడకుండా మ్రోగుతూ ఉండి, తగ్గాలి) నమస్తే! నమస్తే! నమస్తే! నమః! .... (ఒక్క చిటిక నిశ్శబ్దం)

గోమత : ఆచార్యదేవా! ధనుర్దాసు దేవర తిరువడిఘళు నాశ్రయిస్తున్నాడు.

శ్రీ రామానుజులు : నాయనా ! ధనుర్దాసూ!

ధను : స్వామీ! వచ్చాను. ప్రభూ! నన్ను రమ్మని ఆజ్ఞ దయ చేశారా? నన్నేనా? ... హేమా! ఉన్నావా?

శ్రీ రామానుజులు : (వాత్సల్యంతో) ధనుర్దాసూ! వచ్చావా?

ధను : స్వామీ! నన్నే రమ్మని ఆజ్ఞాపించారా?

శ్రీ రామానుజులు : ధనుర్దాసూ! ఇంత ఆలస్యమయిన దెందుకూ?

ధను : : ప్రభూ! ఆలయప్రాంగణందాకా తొందరగా వచ్చాను. ఈ ఉదయం నుంచి నా మనస్సు స్తిమితంగా లేదు; తిన్నగా లేదు ప్రభూ ! కోవెలముందు బధిరాంధులూ భిక్షువులూకూడా 'రంగా

రంగా' అని పిలుస్తూంటే, ఆలయంలోనికి రావడానికి ధైర్యం లేకపోయింది. అయినా, ఆగలేకపోయాను ప్రభూ! నన్నేనా రమ్మన్నారు?

శ్రీరామానుజులు : (వాత్సల్యంతో)నిన్నేనయ్యా! ధనుర్దాసునే!

ధను : స్వామీ! నన్నేనా? ఆహా!

మోసాలన్ బధిరాంధభిక్షువులు
"రావో ప్రోవవో ఓ కృపా
ళూ సామీ" యని మోరలెత్తి పిలువన్,
లోలోన నేదో భయ
మ్మో సంకోచమొ త్రోసె వెన్క;
కపుడే ప్రమోసెన్ "ఒహోహో ధను
ర్దాసూ రాగదవయ్య రా" యను
నుదాత్తాహ్వాన నిక్వాణముల్!

శ్రీరామానుజులు : (జాలిగా నవ్వుతూ) నాయనా! శ్రీరంగనాయకుల అనుగ్రహ విధాన మెట్టిదో నీకు తెలియదు -

రంగేశయాన గేహ
ప్రాంగణ దేహళిని నిలిచి, పలువయు నోరా
రంగా 'రంగా' యని పిలు

వంగా, వైకుంఠ మొరగు వాత్సల్యమునన్!
ధనుర్దాసూ! ఈమె ఎవరు?

ధను : నా భార్య – హేమాంగి!

శ్రీరామానుజులు : మంచి సౌందర్యవతి– చక్కని కన్నులు. ధనుర్దాసా! ఈ ఉదయము శ్రీరంగదేవులు తిరువీథి వేంచేసినప్పుడు, ఉత్సవములో నీవు ఉన్నావుగదయ్యా!

ధను : చిత్తం! నేను .... (సంకోచిస్తూ ఆగుతాడు)

శ్రీరామానుజులు : నీవూ ? ..........

ధను : నేనూ హేమాంగీని! హేమాంగి నా భార్య స్వామీ!

శ్రీరామానుజులు : ఆ! అయితే ధనుర్దాసా! ఇంక చైత్రోత్సవానకూ, శ్రీ సన్నిధానానకూ ఎందకయ్యా రావడము? భగవంతునివైపు నీ చూపే తిరిగినట్లు లేదు. పాపం! ఎంత నిశ్చలంగా వేశావయ్యా గొడుగు నీ భార్యకు! ఆమె నేత్రాలకే కాదూ వేశావు నీ గొడుగు? ఎందుకు ధనుర్దాసూ ఆమె నేత్రాలకు పట్టావు ఆ గొడుగు?

ధను : (సంకోచిస్తూ అంతకంతకు ధైర్యంతో) ప్రభూః

హేమాంగి కళ్లంత చక్కనివి ఇంక లేవు. వాటికోసమే బ్రతుకుతున్నాను. ఒక్క రెప్పపాటు వాటినుంచి నాదృష్టి త్రిప్పలేను. ఎంతకాలం ఉంటానో! ఏమవుతానో! ఇంకో వస్తువు చూసి, ఒక్క త్రుటికాల మయినా పోగొట్టుకోలేను. అవి ఎండతగిలి వాడిపోతాయని భయం వల్ల గొడుగు పట్టాను.

శ్రీ రామానుజులు : అబ్బా! (గంభీరంగా) వాటికన్న చక్కని నేత్రాలు ఉంటే?

ధను : ఉండవు. లేవు.

శ్రీ రామానుజులు : ఉంటే ?

ధను : వాటికే అహోరాత్రాలు సేవ చేస్తాను.

శ్రీ రామానుజులు : మంచిది. ధనుర్దాసూ! ముందు నావైపు నిశ్చలంగా చూడు.

ధను : (ఒక్క చిటిక అయాక).... స్వామీ! నన్ను అలాగ చూస్తారెందుకు? నాలో ఏదో కరిగిపోతూంది. నన్ను ఏదో ఆవహిస్తూంది ప్రభూ! ప్రభూ! (ఒక్క నిముషం ఆగాలి)

శ్రీ రామానుజులు : (నిదానంగా గంభీరంగా) వత్సా! ధనుర్దాసూ! అటు చూడు! సాక్షాత్కరించిన శ్రీ రంగనాయక స్వామి వారి దివ్యనేత్రాలను! మహా ప్రభూ! శ్రీ రంగదేవా!

*ఒక కను గ్రీష్మ భీష్మ కుతపోగ్రతరార్యమ మండలమ్ము; కా*
*ర్తిక శిశిరాంశు బింబముగదే యొకనేత్రము; లోకలోక శా*
*సకుడవు నీవ, నావలచు చల్లని సామివి నీవ; అక్షియు*
*గ్మక మొకసారిగా విరియగా వెరగా యిక రంగానాయకా!*

(రహస్యంగా చెవిలో అన్నట్లు) ధనుర్దాసూ!

ధను : (నెమ్మదిగా పరవశుడై రహస్యంగా అన్నట్లు) ఆహా!

("ఆహా, ఆహా" అనీ, ఓహోహో" అని, "అలాగ చూడు- ధనుర్దాసు మూర్ఛిల్లాడు" అనీ, "శ్రీ యతిరాజులు ఎలాగ దుర్నిరీక్ష్యంగానూ చల్లగానూ కూడా ఉన్నారో" అనీ, "చూడు చూడు-ధనుర్దాసు లేచాడు" అనీ గొంతుకలు. ఒక్క త్రుటికాలం నిశ్శబ్దం)

ధను : మహాప్రభూ! శ్రీ రంగనాయకా! (ఏడుస్తాడు-ఏడుస్తూ)

ఏలా దాచితి విన్నినాళ్లు, దయ లేనే లేదటయ్యా, భవ
ల్లీలాలోల విలోలనాంచల తటిల్లేఖా చలల్లాస్య; మే
నాలోకించితినా, శిలాజడిమ పాయంద్రోయనా; రంగదే
వా, లావణ్యపయోనిధీ! వివశన్నృత్య మ్మాడనా కేకినై!
(ఏడుస్తూ) తండ్రీ! ఎట్టి అనుగ్రహమయ్యా ఈ ధనుర్దాసుపై!
నాతండ్రీ ! చిరదగ్ధజాంగలము
ప్రాణమ్మిద్ది; యుష్మత్కృపా
న్వీతస్ఫీత కటాక్ష వీక్షణము
ప్రావృణ్మేఘమాలా గళ
చ్ఛీతస్రోతము ఒక్కమారయిన
వర్షింపంగదే! ఆరునే
మో తృష్ణాగ్ని? రవంత చల్లబడు
నేమో జీవ మోయీ ప్రభూ!
(ఏడుస్తూ) నా తండ్రీ ! రంగయ్యా!
కన్నులు కల్వపూలయిన,
కజ్జలరేఖ మిళిందబృందమై
న, న్నును చూపు తూపయిన,
నాశము మోస మశాంతి కాక యే
మున్నదయా దయావ్యయ పయోనిధి !
అంధ జగత్తు లోపలన్
తెన్నులు తెల్పులో ! ఎదుట

నిల్చునా మిన్నులు రంగనాయకా !
కనులని నల్ల గలువలని
అనుకొనుటే కాని, శత సహస్రార్యమ దీ
ప్తిని మించి శతసహస్ర తు
హినకర శీతలత నించునే రంగేశా !
కనగ కనగ నీది కన్నేది? మిన్నేది?
అడుగు లేవి? కడలి యడుగు లేవి?
ఎరుగనైన లేను ఏమేను లేని నీ
వీ దృగాళి నెట్టు లిమిడినావు!
వెలికిన్ జూచెదవో, లో
పలికిన్ జూచెదవొ, యింక బహిరంతరముల్
వెలుగో, ఆనందమొ, ఇది
జలనిధియో చదలొ తెలియజాల రమేశా !

(ఒక్క చిటిక నిశ్శబ్దము)

**శ్రీ రామానుజులు** : ధనుర్దాసూ! ఇదుగో శ్రీపాదతీర్థము సేవించు. అమ్మా హేమాంగీ! ఇదిగో నీవూ సేవించు. రండయ్యా ఇటు! పరాశరా! బాలార్యా! గోమఠా! విష్ణుచిత్తా! అందరూ సేవించండి! అమ్మా హేమాంగీ! రా.

(అందరూ కలిసి శ్రీ రంగనాయక ప్రభువుల్ని కీర్తిస్తారు)

జయ జయా జయ ! జయ జయా జయ!
రమాప్రియా జయ ! శుభాశయా జయ!
జయ జయా జయ! నిరామయామృత
సదాశయా జయ! జయా జయా జయ!
సురాసురానత శిరస్స్ఫురత్సుమ
గళన్మరంద స్నపిత పదయుగళ!
చరాచరాత్మక జగన్నికాశ్రయా
దయామయా! జయ జయా జయ !
మునీశయోగి జనతా దృగంచిత
మణీఘృణీ రంజిత పదయుగళా!
దినేశ తారా శశాంక హారా
ఫణీశ శయ్యా! జయ జయా జయ!
(దేవాలయఘంట ఘణాఘణా ఘణా ఘణా మ్రోగుతుంది)

పాత్రలు

| | | |
|---|---|---|
| మల్హణుడు | ... | మహాకవి, శివగణసేవకుడు |
| శివశర్మ | ... | చెలికాడు |
| మల్హణి | ... | దేవదాసి |
| మందయాన | ... | చెల్లెలు |

# సాయుజ్యము

## మొదటి రంగము

(కాశ్మీరదేశములో భారతీపీఠ నగరమున మల్హణుడను మహాకవి ఉండేవాడు. తరుణసుందరుడు, భాగ్యశాలి, పండితుడు, శివగణ సేవకుడు ఈ మల్హణుడు. దివంగతుడైన తండ్రి స్వర్ణభట్టారకు డిచ్చిన అఖండధనముతో హాయిగా కాలక్షేపము చేయువాడు.

భారతీపీఠనగరములో శ్రీ విజయేశ్వరస్వామి ఆలయ ప్రాంగణములో మల్హణుడూ, అతని చెలికాడు శివశర్మ, చాలా దూరాన దేవళములో ఘంటాధ్వని – సన్నాయిపాట– కొన్ని మందర గంభీరస్వరా లుచ్చరించే 'నమశ్శివాయ చ శివతరాయ చ" అన్న మంత్రపాఠం, తాళపుచిప్పల హంగుతో దేవదాసి పాడే కీర్తన స్ఫురణ– ఈ ధ్వనులన్నీ బాగా దూరం నుంచి–)

శివశర్మ : నీవు చూడవు, నన్ను చూడనీయవు మల్హణా. నిక్షేపం వంటి మేళం సాగుతున్నది మంటపం వద్ద.

మల్హణుడు : అట్లా అనకు, శివశర్మా! సానిమేళం చూడ్డానికి వచ్చామా, స్వామి సంధ్యాతాండవం సందర్శించ డానికి వచ్చామా?

శివశర్మ : నేను మొదటిదానికోసమే వచ్చాను, ఎప్పుడూ దాని కోసమే వస్తాను. సాయంకాల మయేసరికి నగరంలోని వారనారీకోటిలో సగం ఇక్కడ ఉంటుంది. వాళ్ళు ఒక్క ఓరచూపయినా నాకు ప్రసాదించరు గాని నేనుమాత్రం వాళ్ళను తేరిపార జూస్తాను సుమీ!

మల్హణుడు : (నవ్వుతూ) అది ధర్మం కాదు.

శివశర్మ : అంతే కాదు. వినూ, ఈ ద్వారతోరణంలో నిలబడి, మొట్టమొదటి వేశ్యకు చిరునవ్వుతో స్వాగత మిస్తాను. చిట్టచివరి వేశ్యను చూపులతో సాగనంపి చివాలున ఇంటికి పోతాను.

మల్హణుడు : శివశర్మా, వీరిలో ఎవరయినా ఒక్క ప్రియురాలిని ఏరుకున్నావా?

శివశర్మ : అదే నాతో వచ్చిన చిక్కు. నేనలాగ చెయ్యలేను, "ఇదుగో ఈ కురంగి నాదీ, ఈ కువలయాక్షి నాదీ" అని ఆ నిముషానకు ఎప్పటి కప్పుడు నిశ్చయించు కుంటాను. మళ్ళీ మళ్ళీ మొదటి కొస్తాను. కానీ ఈ మధ్య కొంచెం స్థిరపడుతూంది మనస్సు.

మల్హణుడు : ఎవరి మీద?

శివశర్మ : మల్హణి చెల్లెలు మందయాన మీద.

మల్హణుడు : మల్హణి ఎవరయ్యా! నాపేరు తగిలించా వామెకు?

శివశర్మ : నీ పేరే కాదు. నీ విద్యా, నీ శివభక్తీ – అన్నీ ఉన్నాయామెకు! నీవే మంటావో అని గాని – నీకు ఈడూ జోడూను. మందయానతో మనం సంతృప్తి పడతాం.

మల్హణుడు : ఎవరయ్యా ఆ మల్హణి ?

శివశర్మ : అలా! అదుగో అదుగో ఆ మంటపం వద్ద సరస్వతి లాగ పాడుతూ, రంభలాగ నృత్యం చేసేదే మల్హణి.

అటు నడుద్దామా? (గారంగా తొందరపెడుతూ)
రావయ్యా, రా రద్దూ, మల్లణా !

మల్లణుడు : నడు !

(పాటా, నాట్యం, చప్పుడూ బాగా సమీపిస్తాయి)

మల్లణి : (పాడుతూ నృత్యం చేస్తూ అభినయిస్తుంది)

నీ కన్న సొగసుకా డేడయా నా స్వామి
నీ కన్న నా వేలు పేడయా !
నీ వన్న నా మనసులో వెన్నెలలు కాయు
క్రొన్ననలు పూయు – నా స్వామి!
*కరగు తరగల గంగ బట్టి – నా స్వామి*
చెదరు జడలను పాదివి చుట్టి
ఆ పాగపై సోగ నెలవంక పువు వెట్టి
మల పట్టి మన సట్టె మరిగించినా వయా
నీ కన్న కోడెకా డేడయా – నా స్వామి.

శివశర్మ : (పాట పూర్తి అవుతుంటే) మిత్రమా, మల్లణా! ఏమంటావిప్పుడు? హయ్యో పరధ్యానం! అనుకున్నంత పనీ అయిపోయింది. ఇహ తేలిపోయింది. చంపేసేవాడవు, కవిత్వమనీ, కాళిదాసనీ, ఇంకా మాటలు వినముగదా! హయ్యో! ఇటయ్యా గర్భాలయం. స్వామి దర్శనానకు వెళ్ళాలి కదూ మనం. సారి సారి!

ఎటు తిప్పినా అటే తిరిగితే ఎలాగ, దిక్ప్రదర్శన యంత్రం లాగ? హమ్మ! హమ్మ మల్లణీ! ఎంత పని చేసేశావు!

**మల్లణుడు :** (నవ్వుతూ) చాల్లే. నడు. ప్రదోషసమయం కావచ్చింది. విజయేశ్వరుల దర్శనం చేసుకుందాం.

(నమశ్శివాయ శివతరాయ చ అన్నమంత్రం దగ్గరగా వినబడుతుంది)

(గర్భాలయం దగ్గిర)

**మందయాన :** అక్కా! నీ కన్న భక్తురాలు ఈ నగరంలో లేదు. కీర్తన పాడి అభినయిస్తున్నప్పుడు నీ వెలా గుంటావో తెలుసునా? భగవంతుని విగ్రహంవైపు చూస్తున్న ట్టుండవు. పరమశివుని పలుకరిస్తున్నట్లుంటావు. ఒక్కొక్కప్పుడు నీ కళ్ళల్లో కైలాసగిరి శృంగం, సంధ్యానాట్యరంగం, పరమశివులూ అద్దంలోవలె కనపడతారు. అప్పుడు నీ పాట గంగానదిలాగ గలగల మంటుంది. దానిలో భావం నెలవంకలాగ మిలమిల మంటుంది.

**మల్లణి :** సరే లెద్దూ.

(హర హర అన్న పాట మల్లణుని కంఠస్వరంలో వినబడుతుంది)

**మల్లణి :** ఆహా! ఎవరా మహేశ్వరులు! ఎంత ప్రపత్తితో మహేశ్వరుని కీర్తిస్తున్నారు! నడు మందయానా!

గర్భాలయం వైపు. ఆహా! ఆ కంఠస్వరంలో కచ్ఛపీ గేయమూ, శ్రీ దేవిగానము. సాక్షాద్విష్ణువు చేతి మర్దల ధ్వనీ, కలిసి మోగుతున్నాయి. ఈ సమయాన మహానటులు తాండవం ఎంత వివశులై చేస్తారు!

(గర్భాలయం సమీపిస్తారు)

మల్హణుడు : (పాట, మధ్య మధ్య శివశర్మ కూడా కలిసి పాడవచ్చు)

*హర హర హర హర హర హర !*
*హర హర హర విజయేశ్వర !*
*విజయేశ్వర ! శివ శంకర !*
*శంకర ! భక్తవశంకర !*
*హర ! పురహర! హర స్మరహర !*
*కరధృత భీకరకర్పర !*
*కటకీకృత కాకోదర !*
*దరహసితానన సుందర !*
*రజత శిలోచ్ఛ్రయ మందిర !*
*హర హర ! సురగంగాధర !*
*హర ! హాలాహల కంధర !*
*జటారూఢ చంద్రాంకుర!*
*నిటాలాగ్ని నిష్ఠుర ! హర !*
*మోహన ! లోకావన ! భవ*
*కానన పటు దావదహన !*

*యోగిహృదయ భవనా ! భవ !*
*పావన ! గిరిజా రమణా !*

**మందయాన** : ఏమేే! అక్కా! అంత ధ్యానముద్రలో మునిగిపోతే ఎలాగా? స్వామిసేవ పూర్తి అయినా ఇక్కడి నుంచి కదల లేకపోతున్నావు? ప్రసాదం కూడా పుచ్చుకోలేనంత పరధ్యానంలో ఉన్నావు. సరి సరి మనిషిక్కడా మన సెక్కడో లా గున్నావు.

**మల్లిక** : మందయానా! ఆయ నెవరే?

**మందయాన** : ఎవరో?

**మల్లిక** : ఆ కీర్తన పాడినవారే! ఆ పిచ్చి బ్రాహ్మణునితో వచ్చిన వారు!

**మందయాన** : ఎవరో ! అంతకన్న పిచ్చివారు! మల్లిక అమ్మా!

**మల్లిక** : వారేనా మహాకవులు? ఎంత తేజస్వి! మందయానా!

**మందయాన** : పరమశైవు లాయెను?

**మల్లిక** : శైవులే కాదు, శివునిలాగే ఉన్నారు.

**మందయాన** : ఇహ నేం?

*నీ కన్న సొగసుకా డేడయా – నా స్వామి*
*నీ కన్న కోడెకా డేడయా !*

(అవి వెటకారంగా పాడుతుంది)

మల్లిణి : తప్పు మందయానా ! అలా అనకు (నిట్టూరుస్తుంది) రా ! ఇంటికి వెడదాం.

మందయాన : ఎవరింటికి? వారి ఇంటికి రానీ రేమో!

మల్లిణి : కాదే ! నడు.

## రెండవ రంగము

(నగరవీథి. శివశర్మ, మందయాన)

శివశర్మ : ఆగు !

మందయావ : నువ్వే ఆగు.

శివశర్మ : ఎవరు నువ్వు?

మందయాన : నువ్వెవరో ?

శివశర్మ : మనం మహేశ్వరులం

మందయాన : మనమూ అట్టివారమే.

శివశర్మ : ఇహనే! ఈడూ జోడు కుదిరింది- ఇన్నాళ్ళకు. ఏ పనిమీద వెడుతున్నావు?

మందయాన : నువ్వేపనిమీద?

శివశర్మ : శివకార్యం మీద !

మందయాన : నేను పరమశివ కార్యంమీద!

శివశర్మ : ఇద్దరమూ ఒక పనిమీదే వెడుతున్నాం. కాబట్టి- ముందు మనిద్దరమూ జట్టుగా, మహోకట్టుగా ఉండాలి. కలిసి, పని చెయ్యాలన్నమాట. నీవు మందయానవు; మల్హణి చెల్లెలువు.

మందయాన : నీవు మందబుద్ధివి; మల్హణుని చెలికాడవు. అయితే.

శివశర్మ : అయితే – తెలిసిపోయింది. ప్రభువులు కలిస్తేనే కాని పరివారం చిక్కులు తీరవు. అంతేనా ?

మందయాన : అంతే.

శివశర్మ : సరే, అలాగే చేదాం. ఈ రాత్రి మొదటిజాము కాగానే మల్హణ మహోకవితో మేము మీ ఇంట సిద్ధం. నాకు నమస్కారం పెట్టి సెలవు పుచ్చుకో!

మందయాన : (నవ్వుతుంది)

## మూడవ రంగము

(మల్హణి ప్రాంగణం)

మల్హణి : (గారాంగా) ఎందు కలాగ చేశారు చెప్పండి? తప్పు కాదూ?

మల్హణుడు : నేను తప్పు చేయను.మరి నీవు నా మనస్సులో నిండిపోయాక, తప్పనేది ఆలోచనలో కూడా రావడం లేదు.

మల్హణి : అలా అనవచ్చునా? మీకు తెలియని ధర్మం లేదు గదా!

మల్హణుడు : (నవ్వుతూ) నీ దయ ఉంటే, నాకూ ఆ నమ్మకమే ఉంది.

మల్హణి : ఉండేనా ఇలా చేశారు? నగర మంతా గగ్గోలుగా ఉంది. మల్హణి వేశ్యాబుద్ధి పోగొట్టుకోలేదు, అమాయకుణ్ణి చేసి ఐశ్వర్యమంతా హరించుకుందీ అంటున్నారు.

మల్హణుడు : లోకం అనుకుంటుందని ఏపని అయినా మానేస్తామా? వివేకం వద్దంటే మానేస్తాం గాని! నా వివేకం నాకు ఈ కార్యం దోషం అని చెప్పలేదు. మల్హణీ! నా ఐశ్వర్యం అంతా నీ కిచ్చానంటే, నిన్ను లోబరుచుకుందామనీ

ఇయ్యలేదు, నా ప్రేమ రుజావు చేసుకుందామనీ ఇయ్యలేదు. ఇచ్చాను అంతే. నా భాగ్యభారం అంతా నీ మీద ఉంచాను అన్నమాట. నీ యెడ అనురాగం కన్న కూడా నాకు గౌరవం ఎక్కువ.

మల్లిణి : స్త్రీ లంటేనే మీకు గౌరవం ఎక్కువ. నగరవీథిలో ఏ స్త్రీ అయినా ఎదురయితే తల వంచుకుని పక్కకు తప్పుకుంటారట.

మల్లిణుడు : ఆమాటల కేం లే; కిట్టనివాళ్ళన్నవి.

మల్లిణి : (నవ్వుతూ) శైవులకుకూడా శివునిపోలికలు ఉంటాయన్నారు కదా పెద్దలు, పరమశివులు పార్వతీదేవికి సగం శరీరం ఇచ్చారు. శిరస్సుపై గంగమ్మను ధరించి పెద్ద చేశారు.

మల్లిణుడు : (నవ్వుతూ) అలాగయితే నేను మహేశ్వరులకన్నా రెండు కారణాలవల్ల గొప్పవాడను. ఒకటి, నా శరీరంలో ప్రత్యణువులో నిన్నే నింపుకున్నాను. రెండు, నాకిద్దరు ప్రేయసులు లేరు.

మల్లిణి : (నవ్వుతూ) సరిసరి. ఇదొకటా! (నిట్టూరుస్తూ) మీరన్నంత నమ్మకంగా, గర్వంగా నేననలేను గదా! ధైర్యంగా అన్నా, ఎవరు నమ్ముతారు?

మల్లిణుడు : నేను. ఒకరి సౌశీల్యం కాని, వ్యభిచారం కాని నలుగురి నోట్లోనూ ఉన్నాయా? కులాన్నిబట్టి గుణనిర్ణయం

చేసే మందబుద్ధిని కాను. అయితే నిన్నెలాగ గ్రహించగలిగే నంటావా? చెప్పనా ?

మల్లికా : చెప్పండి.

మల్లణుడు : (నవ్వుతూ) కొంచెం కవిని గదా! నా చూపు నిజం కనబడేటంతలోతుగా దొలిచి దొలిచి చూస్తుంది. ప్రియుణ్ణి కూడా అయానిప్పుడు. ఆ చూపు మరీ నిశితమై పోయింది. నిన్ను చూడకమునుపు నాకు నిజమేదో తెలిసేది కాదు. అంతేకాక అనురాగంవల్ల ఆర్ద్రమూ, బరువూ అయిపోతాయి నవ్వూ, చేష్టా, ముఖమూను, ప్రేమికుల హృదయాన్ని ఇట్టే పసి గట్టవచ్చు. ప్రేమికులు అమాయికులు.

మల్లికా : అవును. వాళ్ళ అంతరంగమే కాక మూర్తి అంతా కూడా తేటనీటి కొలనులాగ ఉంటుంది.

మల్లణుడు : వట్టి కామ మున్నచోట చూపు రేపుతుంది. కలత పెడుతుంది. ప్రత్యుత్తరం కోసం నిలబడినట్లూ, నీవే మిస్తావూ అన్నట్లూ తొందర పెడుతుంది. నిష్కల్మషమైన అనురాగ మున్నచోట చూపు కరగిపోతుంది. మెరిసిపోతుంది. అంతే. ఈ విషయం గుడ్లగూబలకు తెలియదు. ఇంతకన్న గొప్ప అనుభవం లేదు. అంతే కాక ఏ ఒక్కరినయినా ప్రేమిస్తేనే అందరినీ ప్రేమించగలరు?

మల్హణి : ఎట్టి సత్యాన్నయినా ఎంత తేలికగా చెప్తారు! ఇదివరకు నా మనస్సు గూటిలో పక్షిలాగ రెక్కలు ముడుచుకుని కూర్చుండేది. ఇప్పుడో పక్షాలు తెరచాపల్లా విప్పుకుని కనబడిన ప్రతిప్రాణినీ పలకరిస్తానంటుంది. నాకిప్పుడు అయిష్టులంటూ లేరు.

మల్హణుడు : ఆఁ, అవును. కనుకనే నీ అనురాగ మంటే అంత నమ్మకం నాకు.

మల్హణి : మొన్న మీతో ఒకటి చెపుదాం అనుకున్నా. మీరు మాట్లాడేటప్పు డెప్పుడూ మిమ్మల్ని వెర్రిగా చూడాలని ఉంటుంది. మీ కళ్లూ కపోలాలూకూడా మాట్లాడుతాయి. మీరు వెళ్ళాక అలాగ చూస్తూ పడుకుంటాను. నా బ్రతుకంతా ఆనందవాహినిలో పడవలాగ వదిలేసి. అప్పుడు మందయాన అంటుంది కూడా 'ఎవరూ ఎదురుగా లేనప్పుడు కూడా ఎవరో ఉన్నట్టు చూస్తావేమి అక్కా!' అని.

## నాలుగవ రంగము

శివశర్మ : నువ్వు చెప్పు మా మల్హణుడంత వెర్రివాడు ఈ పట్టణంలో మరొక డున్నాడా? భాగ్యమంతా మీ అక్కకు సమర్పించి ఊరుకున్నాడు.

మందయాన : ఇదిగో, నీమీద ఇష్టం కనుక ఊరుకున్నాను. కానీ ఈ మాటలు మరొకరంటే బ్రహ్మ కైలాసం దగ్గిర ఎగిరి పడేది!

శివశర్మ : అదుగో? ఆ మగధోరణి పనికి రాదంటాను.

మందయాన : మరేం చెయ్యను, నువ్వు ఆడంగిపీనుగువని రుజువయాక. మా అక్క ఆ భాగ్యంలో ఒక తృణమైనా ముట్టుకోదు తెలుసా? ఇద్దరి పేరా గుళ్ళూ గోపురాలూ కట్టిస్తుంది. గురుకులాలు పెట్టిస్తుంది. సత్రాలు ప్రతిష్ఠిస్తుంది.

శివశర్మ : అందుకే పోనీలే అని ఊరుకుంటున్నాను.

మందయాన : లేకపోతే ఊరుకోక ఉవ్వెత్తున అడ్డొచ్చేవాడవు కాబోలు! నీ బోడి పలుకుబడికి.

శివశర్మ : ఆ! నా పలుకుబడి నీకేం తెలుసు! మొట్టమొదట వారు ఇద్దరినీ ఎదురుగా పడేసినవా డెవడు? మాంచి మంగళసమయం చూసి, అంటే ప్రదోషకాలంలో సాక్షాత్తూ శివాలయంలో, మనం మదనదేవుడులాగ మాధ్యస్థ ముండి "ఊఁ సై" అన్నాము కనుక కాని –

మందయాన : ఓయి వెర్రిపీనుగా!

శివశర్మ : ఆ తిట్టు మనమీద నీకుండబడ్డ అనురాగం తెలియబరుస్తుంది. కనక మళ్లీ ఊరుకుంటున్నాను. మళ్ళీ మళ్ళీ ఊరుకుంటాను తెలిసిందా వెర్రిమొహమా! అయితే ఇప్పుడు నాకొక ధర్మసందేహం టపీ మని విడిపోయింది. ఇప్పుడు మీ తల్లి మీ అక్కకు ధనగుప్తుణ్ణి ఎందుకు తారుస్తుందో తెలిసిపోయింది.

ధనగుప్తుడి ధనంతోకూడా సత్రాలూ, గుళ్ళూ, గురుకులాలూ కట్టించి లోకానికి మేలు చేద్దామనీ- అవునా?

మందయాన : ఓరి కంచరగాడిదా! ఆ దిక్కుమాలినధనంలో గవ్వ ముట్టుకోదు అక్క. ఆ ధనగుప్తుడివైపు అరకంటయినా చూడదు. నువ్వు కుక్కవు కనక అలా మొరుగుతున్నావు.

శివశర్మ : నేను మొరుగుతున్నాను. నీ కంఠస్వరం మహా శ్రావ్యమైనదిలే. సరే! నేను గాడిద, కుక్క మొదలైన జంతువు లన్నీని! ఈ పనులు చేయించే మీ అమ్మకూడా కొంతవరకు ఈ తిర్యగ్వర్గలోకే వస్తుంది కదా. మీ అమ్మకడుపున నీవుమాత్రం కథల్లోలాగ మనిషివి పుట్టుకొచ్చావు. ఇక నాతో స్నేహంకూడా కుదిరినా, నువ్వుమాత్రం మనిషిలాగే మిగిలి ఊరుకున్నావు! నాతో స్నేహంవల్ల మా మల్లణుడి చెవులుకూడా పొడుగ్గా అవుతాయేమో దైవమా!

మందయాన : ఏడిశావు! కళ్ళున్నవాడు కనుక నీ స్నేహితుడికి మా అక్కలో విశ్వాసం ఎప్పుడూ రవంత చలించదు.

శివశర్మ : అలా అనకు. కళ్ళులేని నాకు నీలో విశ్వాసం రవంత పోయిందా? ఊరికే సన్నిపాతజ్వరంలాగ ఎక్కువై పోతుంది కానీ – ఒక్క చిల్లిగవ్వ నీ కియ్యక పోయినా, నీవు నన్ను వదలడం లేదు. ఆశ్చర్యం!

మందయాన : నీ కూతల కేం లే ! పోదాం రా! అదుగో ఆ నల్లకొండలపై మేస్తూన్న మేఘాలు బయలులో బడి ఉరకలు వేస్తున్నాయి. దిక్కులు వెర్రిగా నిట్టూరుస్తున్నాయి. గాలివాన వస్తుందేమో. పాపం అక్కదగ్గిరకి పరుగెత్తాలి! ఈ మధ్య అక్క ఏదోలాగ మారిపోయింది. ఇదివరకు ఎవరో ఎదురుగా ఉన్నట్టు చూస్తూ ఉండేది. ఇప్పుడు వారే లోపల ఉన్నట్టు చూసుకుంటుంది.

(గాలివాన మొదలు) అమ్మయ్యో! పోతా!

## తుది రంగము

(రాత్రి, హోరుగాలీ, గాలివానా, తలుపులు వేసి ఉన్న ఇంట్లోకి వినబడనట్లు మాటలు ముంచెయ్యకూడదు. మల్లణువి ఇల్లు)

మల్లణుడు : ఎవరదీ?

మల్లణి : స్వామీ! నేను !

మల్లణుడు : అదేమి? మల్లణీ! ఇప్పుడొచ్చావు? అయ్యో! తడిసి ముద్దయిపోయావు! పావం! అయినా ఎంత మోహనంగా ఉన్నావు! మల్లణీ! అలాగే ఉండు! ఈ మూర్తిని కూడా మనసారా చూడనీ! ఆహా! తొలకిన గంగాజలంలో తడిసిన శివమూర్తిలా గున్నావు. మల్లణీ, ఈ గాలివానలో వచ్చావేం? ఏమి రాత్రి ఇది!

మల్లాణి : ఏమి రాత్రి ఇది? స్వామీ! నా దగ్గరగా రండి ఇల్లాగ! ఇలా నా చేతులు పట్టుకోండి. నన్ను దగ్గరగా అదుముకోండి. స్వామీ! హబ్బ! నా మనస్సు మనస్సులో లేదు ప్రభూ! ఈ రాత్రి పరమశివులు పట్టణవీథులలో సంచారం చేస్తున్నారు. నేనింట్లో ఎలాగ ఉండగలను? నా తల్లి తీసుకొని వచ్చిన ధనగుప్తుడు శయ్యాగారంలో హాయిగా నిద్ర పోతున్నాడు. ఎవ్వరికీ తెలియకుండా నేనిలాగ వచ్చాను.

మల్లాణుడు : పాపం! ఎంత తడిసి పోయావు? ఎలాగ రా గలిగావు?

మల్లాణి : ఎలాగ ఉండిపోగలను? మనస్సులో గాలివాన రేగిపోతుంటే, ఎలాగ ఉండి పోగలను? ప్రతి గాలిమూలుగూ మీ పిలుపులాగ వినబడితే! మీ పిలుపో, శివుని పిలుపో! అదుగో ప్రమథులు శంఖాలు ఊదుతున్నట్లు, వినండి, ఏమి గాలి!

మల్లాణుడు : ఇక్కడి కొచ్చినా నీ మనస్సు శాంతంగా ఉన్నట్టు లేదే! మల్లాణీ, నీ విదివర కున్నట్లు లేవు. ఇదివరకు దేవళంలో విజయేశ్వరుల శిఖమీద బాలచంద్రరేఖలాగ నిశ్చలంగా ఉండేదానవు. ఇప్పుడు మహానటుని శిరస్సుపై త్రుళ్ళింతలాడే గంగాదేవిలా ఉన్నావు! నీ వలాగ ఉంటే నా మనస్సు కూడా కల్లోలంగా ఉన్నది. చిత్రం, నీవు నాలో నిండిపోవడంవల్ల, నీతో కూడా మారుతుంటాను కాబోలు !

మల్లాణి : అదిగో అదిగో! శంఖధ్వని! కాదు కాదు, వినండి! వృషభ వాహనం రంకె వేస్తూంది. రమ్మంటుంది. ఊఁ హాఁ కాదుపాము పేరులు బుస్సు మంటున్నాయి. (కొంచెం ఆగి) స్వామీ! ఎన్నాళ్ళయింది మనం దేవళానికి ప్రభుదర్శనానికి పోయి!

మల్లాణుడు : ఏమో నాకెప్పుడూ శివసాన్నిధ్యంలో ఉన్నట్టే ఉంది.

మల్లాణి : కాదు స్వామీ, నడవండి! వద్దు, ఇక్కడ ఆగవద్దు. దేవళానికి పోదాం. ఎలా గుండగలం? పరమశివులే మనల్ని పేరెత్తి పిలుస్తుంటే! అదుగో "మల్లాణా! మల్లాణా!" వినరేం. నడవండి. ఇలాగ ఏదీ చేయి? రండి ఇలాగ (తలుపు తీసిన చప్పుడు) వస్తున్నా. విజయేశ్వరా! నీ భక్తుణ్ణి తీసుకు వస్తున్నా. నా తప్పు లేదు. నన్ను మన్నించు తండ్రీ! ఊఁ హాఁ హాఁ హాఁ (వణుకుతూ)

*కైలాసపురి నుండి కాశికై*
*కాశికాపురి నుండి దాసికై*
*వేంచేసినా వయా విజయేశ్వరేశ్వరా!*
*కరుణానిధీ ! ఓయి లావణ్యశేవధీ.*
*మీరూ పాడండి. ఊఁ త్వరగా! తొందరగా!*
*విరిసి జాబిలి మల్లి రేకగా,*
*దరిసి తేనియల మువ్వాకగా*
*కురిసి మాపయి ధార ధార ముంచెత్తరా!*
*కరుణించరా స్వామి విజయేశ్వరేశ్వరా!*

ఆఁ. అదుగో దేవళం. హమ్మయ్యా! చెప్పాను గదూ! వినండి. ఈ అర్ధరాత్రి విజనంగా ఉండవలసిన దేవళంలో ఎందుకు చెప్పండి ఈ కోలాహలం? అదుగో, గర్భాలయం తెరచి ఉన్న దెందుకు చెప్పండి? మహేశ్వరులు కొలువు దీర్చి ఉన్నా రెందుకు? మన కోసమే! మన కోసమే! నడవండి. తొందరగా, అమ్మయ్య, స్వామిపాదాలమీద పడి కీర్తించండి. ఆనాడు పాడినట్లు !

మల్లణుడు : (శాంతగంభీరంగా) మల్లణీ! అంతా వింతగా ఉంది నాకు! ఎట్లా కీర్తించగలను? నాలో, నా మనస్సంతా ఒక్కరే నిండిఉన్నారు. ఒక్కరే! మల్లణీ! నీకే గాని మహేశ్వరులకు చోటు లేదు నా హృదయంలో, స్వామి మూర్తిమీద నాకళ్ళయినా స్థిమితంగా నిలవడం లేదు, నీ వెదురుగా ఉంటే, నీ వెదురుగా లేకపోతే, నా మనస్సు అసలే నిలవదు.

మల్లణి : స్వామీ! ఇటు చూడండి. ఇటు. ఇదుగో! నేవిల్లాగపోయి మహాదేవుని వెనుక నిలబడతాను. చూడండి, ఇలాగే, నావైపే, చూడండి. చలించకుండా- ఊపిరి వదలకుండా- రెప్పవాల్చకుండా- ఇలాగే - ఇలాగే - ఇలాగే.

(చివరిమాటలు దూరంగా కరగిపోతాయి)

మల్లణుడు : ఆహా! హరహర ! హరహర! (నిట్టూరుస్తాడు)

(పాట, మెల్లగా, సందేహిస్తూ)

*ఆహా! రథీకృతక్ష్మామండలా!*
*ఓహెూ! సరీసృపశ్రీకుండలా!*
*నీహారశిఖరి పు*
*త్రీహారి హృద్వరా !*
*హరహరా! హరహరా! హరో!*

ఆహా! ఏమిది! మనస్సులో మంచుగడ్డలాగ ఏదో కరగిపోయింది. మల్లాణీ! మల్లాణీ! ఏదీ? మహేశ్వరా, ఎక్కడున్నావయ్యా? మల్లాణీ, నన్ను మోసం చేస్తున్నావా? ఇదేం మాయ? నీవు పరమశివుని వేషం వేసుకుంటున్నావా, పరమశివులు నీ మోహినీ రూపం ధరిస్తున్నారా? అయ్యయ్యో! అయ్యయ్యో! ఎలాగ నేను తెలుసుకోవడం? ఎలాగ మల్లాణీ? ఎలాగ మల్లాణీ!

(పద్యం)

*ఏలాగువే మల్లాణీ?*
*స్వామి ఏమందు?*
*మందుడ!*
*మనసంత సందియములె!*
*తుదిమొదల్ తెలియ దేదో!*
*వింత సందెలో వెరగాయె!*
*ఎరు కంత కరగిపోవు తెర గాయె!*
*మేనంత తెరచిన చూపాయె!*

చూపంత నిండిన రూప మాయె!
నీవా!
నీవో!
మల్లెపూవో వెన్నెల ప్రోవో తలపైన!
అళికాన తిలక మౌనా, అనలనేత్రమె యౌనా!
ఆ అరుత పొగడపూలచేరో,కాకోదరమాల సొరో!
అరెరె! న్యామోల సుందర తరుణమూర్తి
నీవా, మల్లణి! నా తండ్రి నీవా వీవా!
(పాట)
జయ మల్లణి! ప్రియతమ! జయ!
జయ ప్రియతమ! శివ!శివ! జయ!
శశి కిరీట! జటాజూట
సొరధునీ చలక్రుపీట!
తండ్రీ, మహేశ్వరా!
(పద్యం)
ఓవని లజ్జ నీ పదపయోజములన్
బడిపోదు, ఆ పయిన్
నాపయి నుంత వంగి, కరుణా
వరుణాలయ, నీవు చేతులన్
జాపెదు, అంత నా బ్రతుకు
చల్లబడున్ జలుజల్లు లైన సా

రావగ నీటిసోనల హిమాంశువు
వంక తొలంకు వానలన్.

తండ్రీ! అఖిలలోకమోహన మైన నీ మూర్తిని ఇప్పుడు దర్శించలేక పోతున్నాను.

ఆవగ సోగపాగ నెటు లౌదల
జొట్టితొ, ఎట్లు పెట్టితో
ఆవయి ఓరగా నవసుధాకర
రేఖ తురాయి గాగ, నీ
రూపు కనుంగొనన్ మనసు లో గొన
తొందర లౌను కాని నీ
దాపున నిల్చి నీ యడుగు దామర
చూపులె నిల్ప జాలనే?

పతితపావనా! నన్ను క్షమింపవూ?
మదనారీమృదులాంకపాళి,
కుచయుగ్మస్ఫారశయ్యాళి, మొ
హ దశాఘోరనిశాసుషుప్తి
వివశం బైపోయె నాశీర్షమో
మదనారీ! ఒకసారి నీ చరణపద్మ
మ్మంటగా నిమ్మ నా
బ్రదుకుం ద్రోవల క్రొత్తప్రొద్దు
వెలుగుం బంగారముల్ నిండగా!

వినుమిదె, చేతులెత్తి వినిపించెద
నే నొకతూరి తెల్వి మా
లిన జడుడన్, విమూఢుడ, మలీమస
హృత్తుడ, ఛిన్నుడన్ శరుం
డ నగుట, యంత్ర కర్మకలనంబు
ఘటింపకు; ఆజవంజవం
బను గహనంబు నింక, అభవా?
చొరజాలను తండ్రీ, వెండియున్!

ఓం నమ శ్శివాయ చ
శివ తరాయ చ
నమ శ్శివాయ చ
శివ తరాయ చ
నమ శ్శివాయ చ
శివ తరాయ చ

(గట్టిగా శంఖధ్వని)

(శ్లోకం)

కాంతా కచప్రచయ పుష్పసుగంధి గంధ
లుబ్ధ భ్రమత్ భ్రమర కర్బుర కంధరాయ,
గంధర్వ యక్ష సుర సిద్ధ కిరీట కోటి
సంఘట్ట ఘృష్టచరణాయ, నమ శ్శివాయ!

(శంఖ ధ్వని)

పాత్రలు

శ్రీరాముడు

సీతాదేవి

లక్ష్మణుడు

సుమంత్రుడు

గుహుడు

మొదటి నిషాదుడు

రెండవ నిషాదుడు

పడవవాళ్లు—ముగ్గురు ఆడ, ముగ్గురు మగ

# గుహుడు

## కవి

"జాహ్నవీ నీరములతోడ, సదమలాశ్రు
పూరములతోడ కడిగెను మును గుహుండు,
ఆర్ద్రసుకుమార సుందర మ్మడుగుదోయి
చిన్నె లెన్నండు విలుచు నీ జీవికవయి!"

(సీతారామ లక్ష్మణులు వనవాసమునకు వెళుతూ, గంగానది దాటడానికి శృంగిబేరగ్రామమువైపు వస్తున్నట్లు, నిషాదరాజా గుహుడు వింటాడు. వివి, భక్తుడు ఆతిథ్య సన్నాహాలు చేస్తాడు.)

(దూరాన శృంగిబేరగ్రామములో కలకలము. దానితో కలిసి, గంగానది ఒడ్డుల్ని కొట్టుకునే చిన్న కెరటాల గలగల)

గుహుడు : తోవలో రాళ్ళూ రప్పలూ అవీ తీసి పారేశారా?

మొదటి నిషాదుడు : ఆఁ !

గుహుడు : కంచెలుకూడా కొట్టివేసేశారా?

రెండవ నిషాదుడు : ఆఁ ! ఆఁ!

గుహుడు : ముళ్ళపొదలూ .....

మొదటి : హబ్బ! కొట్టి పారేశామయ్యా బాబూ!

గుహుడు : తొందరపడకు నాయనా! ఒక్క ముల్లూ లేకుండా ఏరి పారెయ్య వలసిందయ్యా! పారపాటున ఒకటీ అరా ఉండిపోతుందేమో బాబూ! అయ్యయ్యో! అందుకే కాదూ, నాయనా, లేతలేత పసరుటాకులు మార్గమంతా పరచమన్నాను! మీరు తిన్నగా వినిపించుకోరయ్యా! కోపం వచ్చిందా? అసలు, ముందు, ధూళి రేగకుండా గంగాజలం చల్లి ఉండవలసింది. కోపం వద్దయ్యా– కోపం వద్దు!.... ఎంత పొరపాటు చేశారయ్యా! ఎంత చల్లగా, ఎంత మెత్తగా, ఎంత సురభిళంగా ఉండాలి, నా స్వామి నడిచే తోవ ! నా స్వామి! నా ప్రభువు!

మొదటి : పోనీ, నీవే చెయ్యకపోయావా నీకు నచ్చినట్టల్లా?

రెండవ : మేము ప్రాణాలతో మిగిలేనా ఉందుము.

గుహుడు : నేను కదలలేక పోయాను తండ్రీ! కాళ్ళూ చేతులూ ఆడలేదు – నాయనా!

(విషాదు లిద్దరూ నవ్వుతారు)

మొదటి : ఈ సంగతులన్నీ నువ్వు నూరుసారులు చెప్పావు.

రెండవ : విశదంగా చెప్పావు; వివరాలతో చెప్పావు. మేము రవ్వంత లోపం రాకుండా, పూర్తిగా నువ్వు చెప్పినట్లే చేసి ఊరుకున్నాం.

మొదటి : చేసి, వెయ్యిసార్లు తిరిగి తిరిగి పరీక్షించాం.

రెండవ : ఒక్కొక్కళ్ళమే పరీక్షించి, నీ దర్శనాని కిలాగ వచ్చాం. కనకా –

మొదటి : మమ్మల్ని అనుగ్రహించి, ఇంక ఆ సంగతి ఎత్తకు మహాప్రభూ అవి విన్నవించుకుంటున్నాం.

గుహుడు : నా తొందర మీకు తెలియదు. ఇక్కడ నేనుంటే, మీ యత్నమంతా చూసే ఉందును కాదూ? ఇందాకానే నేనెదురుగా వెళ్ళి పోయాను; నా స్వామికి స్వాగత మియ్యడాని కప్పుడే పరుగెత్తి పోయాను.

రెండవ : నిజంగా ఇక్కడ లేకుండా నువ్వు అలా పరుగెత్తి పోయినా బాగుండును.

గుహుడు : కాదు. నేనలాపరుగెత్తలేదు; పరుగెత్తలేను. నేనెందుకు పరుగెత్తడం? (నవ్వుతూ) నేనొక్క అడుగు వెయ్యబోయేసరికి ఆ మహారాజే వెయ్యి అడుగు లెదురుగా వస్తూంటే .. (గట్టిగా నవ్వుతాడు. నవ్వుతూ హఠాత్తుగా ఆగి) – వస్తున్నాడు! వస్తున్నాడు! నా మహాప్రభువు వస్తున్నాడు! నా తండ్రి వస్తున్నాడు! నా రామచంద్రమూర్తి వస్తున్నాడు!

మొదటి : మా కెందు కొచ్చిందో ఈ గుడ్డితనం?

రెండవ : ఈ చెవుడూను!

మొదటి : నీ కెవరన్నా కనబడుతున్నార్రా?

రెండవ : మాకు ఇదివరకులాగే ఉండి ఊరుకుంది అంతాను!

(గుహుడు పరవశుడైనట్లు, వాళ్లమాటలు విననట్లు)

గుహుడు : *ఎంత చల్లగ ఎంత హాయిగ స్పృశించు*
*నా వలచుసామి మృదు కరుణాచరణము !*
*చిరనిదాఘ దగ్ధమ్ము జర్జరితము జడ*
*జాంగల మ్మిద్ది శ్యామల శ్యామలమగు!*

మొదటి : ఇతనికి మతిపోయిందనలేదురా నేను?

రెండవ : ఇందాకట్లాగే వుంది ఈ బయలంతా. కొత్త చేలూ కొత్త తోటలూ ఏవైనా హఠాత్తుగా పొడుచుకుగాని వచ్చినట్లు నీకు కనబడుతున్నాయా?

గుహుడు : నాలోపలికి వచ్చి చూడం డయ్యా!

మొదటి : మేము రాలేము. అది మావల్ల కాదు.

రెండవ : ఉహు! వాడేనా కొంత శ్రమపడగలడు గాని, నేనసలే నీలోకి రాలేను.

గుహుడు : (మరీ పరవశుడై, కొంత తొందరగా)

*ఎంత సుస్పష్ట సుషిమమై యెటు ధ్వనించు*
*అనుగు కన్నయ్య తియ్యని అడుగుదోయి!*
*అంత దవ్వుల సందడి యింత దరిసి*
*మెరసి పోవునె నా గుండె నొరసి యొరసి!*

ఆహా! ఆహా! ఆహా!

మొదటి : గుహా! గుహా! గుహా! ఇలాగ అయిపోతున్నా వేమయ్యా పాపం !

రెండవ : అంతకంతకు శ్రుతి మించిపోతోంది. ఎలాగా?

గుహుడు : అవునయ్యా! శ్రుతి మించిపోతుంది. నాలో ఎవరో పాడుతున్నారు; ఆయన పాదాలు తాళం వేస్తున్నాయి.

మొదటి :

రెండవ : అయ్యయ్యో!

గుహుడు : నాలో ఏదో పరుచుకుని పోతోంది. దాని మీద ఆయన పాదాలు నడుచుకుంటూ వస్తున్నాయి.

మొదటి : ఏం చెయ్యమురా?

రెండవ : ఏలాగునోయి బాబూ ఇది?

మొదటి : ఇదేమిట్రా ఇలా గయాడు?

రెండవ : ఆ! ఆ! (ఆత్రంతో అన్నట్టు)

గుహుడు : నన్ను పట్టుకోండి! అయ్యో! ఈ పుంత వణకి పోవడము లేదూ? ఈ పుంత కదలిపోవడము లేదూ? ఈ పుంత ఊగిపోవడము లేదూ? పాపం! ఏం చేస్తుంది? స్వామిపాదాలు అలా అలా తగులుతూంటే, ఎలాగ స్తిమితంగా ఉండగలదు?

(నవ్వుతాడు పరవశుడై)

రెండవ : దారి వణకడమూ కదలిపోవడమూ ఏమిటయ్యా?

మొదటి : జాలేస్తూంది నిన్ను చూస్తే !

గుహుడు : *ఎంత తొందర పరువుల నేగుదెంచు*
*నన్ను నేలెడువాని ఘృణాపదమ్ము!*
*కదలి ప్రాణాలు, నా మేను వదలి, ఎదురు*
*తెరువులై, ఎట్లు లహరులై కరగి పారు!*

అబ్బా! నన్ను పట్టుకోరూ? పట్టుకోరూ నన్ను? ఎంత ద్రోహం చేస్తున్నాను! మహాప్రభువుకి ఎదురుగా వెళ్ళి స్వాగతం ఇవ్వలేకపోతున్నాను. ఎంత ద్రోహం జరిగింది! అయ్యో! నిలబడ లేకపోతున్నాను. పట్టుకొండయ్యా నన్ను! అడుగో – అడుగో– నా మహారాజు! అడుగో – అడుగో – నా రామచంద్ర ప్రభువు! నా తండ్రి అడుగో ! నా స్వామి అడుగో! అడుగో!.....

(దూరాన పుంత మొదల్ని శ్రీ సీతా రామ లక్ష్మణులు సుమంత్రునితో – రథం దిగుతూ)

సుమంత్ర : సౌమిత్రీ! ఈ పుంతలో ఇంక రథం సాగదు. ఇక్కడ దిగాలి.

లక్ష్మణ : ఇక్కడ నుంచి గంగానదివరకూ నడవాలి కాబోలు! వదిన గారికి శ్రమ అవుతుందేమో!

సీత : నాకు శ్రమ ఏమిటయ్యా? ఈ సాయంకాలపు గాలీ, ఈ వేణు వీథీ, నేను ఎంతదూరమయినా ఇలా నడవగలను.

సుమంత్ర : చూడు సౌమిత్రీ! అదుగో- గుబురుగుబురుగా ఉన్న దే- అది, ఆ మామిడితోపులో నుంచి -

లక్ష్మణ : ఆ! అవును. పైకి నీలిలతలాగ పొగ పాకిపాకి, ఆకాశంలో కరగిపోతూంది.

సుమంత్ర : ఔనయ్యా! అదే శృంగిబేరము. నిషాదరాజు గుహుడున్నాడే! అతని గ్రామం.

లక్ష్మణ : ఆకుపచ్చ చీర కట్టుకునో, లేక, ఆకుపచ్చ తెర వెనకాల ఒదిగో, ఉన్న లజ్జావతిలాగ, తొంగి చూస్తూన్నట్టుంది ఆ గ్రామం.

సీత : మా చెల్లెలులాగ!

లక్ష్మణ : అన్నగారు అలాగ పరుగెత్తుతున్నట్లు నడుస్తున్నాడేమి!

సీత : : వారి మనస్సు ఇక్కడ లేనట్లున్నది కూడా! మనము నడవ లేక పోతున్నాము కాదూ!

లక్ష్మణ : ఏదో అవసరాహ్వానమో- ఆర్తనాదమో- ఆప్త కంఠస్వరమో విన్నప్పుడల్లా అన్నగా రంతే!

గుహుడు : (దూరాన్నుంచి పిలుస్తూన్నట్లూ, దానితో కలిసి అడుగుల చప్పుడైనట్లూ) రామచంద్రప్రభూ!

(ఇంకా దగ్గరగా) రామచంద్రా!

(మరీ దగ్గరగా) నా రామచంద్రా!

శ్రీరాముడు : (మేఘగర్జనలాగ) గుహా!

(నిశ్శబ్దము)

## రెండవ రంగము

(గంగాతరంగాల గలగలలతో కలిసి, వీలుంటే గాలి ఉస్సు రుస్సురులతోనూ కలిసీ, పడవవాళ్ళ పాట. ముగ్గురు ఆడవాళ్ళు, ముగ్గురు మగవాళ్ళూ కలిసి పాడతారు)

*గుండెల్లో ఉండాలి కులాసా !*
*నిండాలీ మనసులో దిలాసా !*
*ఐలెసా అంటు నావ*
*అలల మీద వదలాలీ*
*ఓలెసా అంటు నావ*
*గాలిదారి కదలాలీ*
*గుండెల్లో ఉండాలి ..........*
*గాలికి కోపం రానీ,*
*కడలికి వెర్రెత్తనీ!*
*గాలి కడలి ఏకమై*
*బైలంతా రేగనీ !*

*గాలిజాలు పట్టేదీ,*
*కడలి నడగ త్రొక్కేదీ*
*కనపడని సరం గాకడే!*
*కనపడని సరంగే –*
*గుండెల్లో ఉండాలి .......*

*చీకట్లో వెన్నెల్లు*
*చిలికే దెవరు?*
*నీళ్లల్లో దారుల్లు*
*నిలిపే దెవరు?*

*అసలు పడవ నడిపేదీ,*
*అవలి ఒడ్డు చేర్చేదీ*
*అగపడని సరం గాకడే !*
*అగపడని సరంగే –*
*గుండెల్లో ఉండాలి......*

**గుహుడు** : ఆ! ఆ! ఆగండి! ఆగండి! ఆ పాట ఆపండి! మహా ప్రభువు వచ్చారు. మా స్వామి విచ్చేశారు.

**సీతా రామలక్ష్మణులు** : నమో నమస్తే భగవతి భాగీరథి !

**గుహుడు** : రండి తండ్రీ! అమ్మా రండి! ఇలాగ, ఇటు! ఈ రేవు దగ్గరికి. ఇట్టు! పట్టండి, పట్టండర్రా ఆ పడవని, ఒడ్డును ఒరిసేటట్లు! .... దానిలో ఆకులూ పువ్వులూ పరిచారా? మహాప్రభూ! ఎక్కండి! అమ్మా! ఎక్కండి

అమ్మా ఎక్కండి! స్వామీ ఎక్కండి! నా తల్లి ఇక్కడ! నా తండ్రి ఇక్కడ! ఇక్కడ నా చిన్నాయన లక్ష్మణ స్వామి! ఇవాళ ఇల్లాగై పోయానూ- ఎలాగ తీసుకువెడతానో ఈ పడవని? .... వద్దు వద్దు! ఉహు! ఇంకెవ్వరూ వద్దు. నేనే తీసుకు వెళ్ళాలి నా ప్రభువుని, మహారాజుని! మహారాజా! నాయనా! ఆ! కదిలింది పడవ! మాట్లాడను. పడవ జాగ్రత్తగా నడిపించా లాయెను. మహాప్రభువును తీసుకువెళ్ళా లాయెను!

లక్ష్మణ : సుమంత్రుడు అన్నగారివద్ద సెలవుతీసుకొని వెళ్ళేటప్పటి వేదన కొంతవరకు ఈ గుహుని సహవాసమువల్ల చల్లబడింది.

సీత : రథము దిగీ దిగకముందే వారెలాగ పరుగెత్తారు!... ఎప్పుడు విన్నారో అతని పిలుపు!

లక్ష్మణ : ఇక ఇద్దరూ దగ్గరగా వచ్చినకొద్దీ, ఎవరు ఎక్కువ తొందర పడిపోయారో చెప్పలేము.

సీత : కూడా మనము ఉన్నట్లే తెలియదు. మీ అన్నగారికి అప్పుడు.

లక్ష్మణ : ఇంక అన్నగారు సమీపించగానే అతడు నిలువునా కరిగి, కరిగీ, కరిగి -

సీత : ఎలాగ వారి పాదాలమీద వివశుడై పడిపోయాడు!

లక్ష్మణ : ఆ తరవాత, ఆతిథ్యము ఇయ్యడమో!

సీత : పరిచారకుడు గంగాజలము తీసుకొని వచ్చేదాకా ఉండనే లేక పోయాడయ్యా! కన్నీటితోనే ఆ పాదాలను తడిపేశాడు, ఎంత అదృష్టవంతుడు!

లక్ష్మణ : అమ్మా! చూడండి! ఆ చుక్కానివద్ద ఎంత దృఢంగా, బలంగా, తాళవృక్షంలాగ నిలబడ్డాడో! అంత-

సీత : అంత వినయమూ గౌరవమూ శాంతిసౌజన్యమూ ఒలికి పోతున్నాయి కాదూ నిలువునా!

లక్ష్మణ : గుహా !

గుహుడు : అయ్యా లక్ష్మణస్వామీ! మీరు సుఖంగా ఉన్నదా? ... మా తల్లికి శ్రమగా లేదు గదా!

లక్ష్మణ : లేదు లేదు. మనది కొత్తపరిచయమయినా, ఎన్ని యుగాల బాంధవ్యమోలా గున్నదయ్యా!

గుహుడు : అయ్యో స్వామీ! ఇది కొత్త పరిచయ మేమిటి తండ్రీ! ఎప్పటినుంచో ఎరుగుదును నా మహాప్రభువుని. ఆ పాదాలు ఎప్పటి నుంచో నడుస్తున్నాయి నాయనా నా మనస్సులో. నే నిదివరకే చూశానయ్యా వాటిని. ఎంత అంటీ అంటకపోయినా, ఆ పాదచిహ్నాలు ఇట్టే పోల్చుకోగలను సుమా– లక్ష అడుగుజాడలలో!

లక్ష్మణ : ఇందాకా ఎంత ఆత్రతగా నడిచివచ్చా రనుకున్నావు అన్నగారు నీ కోసము!

గుహుడు : ఇందాకా ఏమిటి లక్ష్మణస్వామీ? అంతా ఎరిగుండి అలా సెలవిస్తారేమిటి? ఇందాకా రావడ మేమిటి? అలాగ వస్తూనే ఉన్నారు- నా ప్రభువులు, నా కోసము, ఎప్పుడూ వస్తున్నారు, ఆహా! ఎప్పటినుంచో వస్తున్నారు. ఎక్కడినుంచో వస్తున్నారు. నా కోసమే! నా కోసమే! నా తండ్రి నా కోసమే వస్తున్నారు.

లక్ష్మణ : ఆహా! ఏమిటి ఈ మహానుభావుడు! ఏ పరమభాగవతుడూ అనలేనిమాట అంటున్నాడు. అన్నగారియెడల ఇటువంటి భక్తి ఇది వరకు ఎన్నడూ నేను ఎరగను.

సీత : ఇది చాలా చిత్రమైన అనుభవమయ్యా! ఈ సంధ్యాసమయమూ! గంగానదీ! ఈ పడవమీద ప్రయాణమూ! ఆ భక్తుడు పడవనడపడమూ!

గుహుడు : అయ్యో తల్లీ! నేను నడపడ మేమిటి? సర్వమూ నడిపే వానిని నడపేవా డెవడమ్మా! ఈ భాగ్యం నాకొక్కడికే దొరికిందమ్మా! గుహుడు రామచంద్రప్రభువుకు కర్ణధారి! (నవ్వు) నేను ఒళ్ళు మరిచిపోతున్నాను తల్లీ! నా ప్రభువే నడిపించాలి ఇంక!

*పడవ నడుపుము కర్ణధారీ !*
*కడిమి విడువక కడలి మీరీ!*

దుడుకు పరువుల పడవ -
సుడులు తిరిగే పడవ -
తడసి రానేలేక తల్లడిల్లే పడవ !
సొగసి మునిగే పడవ - ఎగసి ఆడే పడవ!
సొగసుగా హంసగా సురిగి పోయే పడవ !
రేవువై, నిలుచు చుక్కానివై, చుక్కవై,
భావికా లానుకూ లానంద వాయువై !
రామచంద్రా!

శ్రీరాముడు : (మేఘగర్జనలాగ) గుహా!

(నిశ్శబ్దము)

## మూడవ రంగము

సీత : పడవ ఒడ్డు చేరేదాకా పాడుతూనే ఉన్నాడు. హఠాత్తుగా పడవ ఒడ్డుకి తగిలేటప్పటికి స్మృతి వచ్చినట్లుంది అతనికి.

లక్ష్మణ : అన్నగారివద్ద గుహుడు సెలవుతీసుకునేటప్పటి దృశ్యము దుస్సహమయి పోయింది.

సీత : భక్తితో వేదనతో మెరుస్తూ తడుస్తూ ఉన్న ఆ గుహుని కళ్ళల్లో ఏ ముందో తెలుసుకోలేకపోయాను.

లక్ష్మణ : శాంత కరుణా రంజితమైన అన్నగారి కటాక్ష

వీక్షణములో ఎట్టి అభయప్రదానము గోచరించింది! అంతవరకూ ఝుంఝూనిలంలో సముద్రంలాగున్న అతని ముఖము అన్నగారి ఆ ఒక్క చూపుతో శాంత శరత్కాసారమై పోయింది.

సీత : లక్ష్మణా! వెనక్కి తిరిగి చూడు! ఆ ముసురుకొనివచ్చే రాత్రి తొలిచీకట్లలో - ఆ గంగానదిమీద - ఆ రేవులో - కదలకుండా బాధాభారంవల్ల నిలిచిపోయిన ఆ పడవలో - ఆ గుహుడు ఇటే చూస్తూ ఎలా నిలబడ్డాడో !

లక్ష్మణ : ఏదో మాట్లాడుతూన్నట్టున్నాడు.

సీత : పాపము !

గుహుడు : (దూరాన్నుంచి నిదానంగా నిశ్చలంగా గంభీరంగా అన్నట్లు) శ్రీరామచంద్రమూర్తి వెళ్ళిపోయారు. మళ్ళీ తిరిగివస్తారు. నేను మాత్రం ఈ పదునాలుగేళ్ళూ ఈ రేవులో ఈ పడవలో వారికోసం ఇక్కడే వుంటాను ... అదుగో ! గంగా యమునా సంగమం దాటారు. అదుగో ఆ అరణ్యంలో నుంచి చిత్రకూటము ఎక్కుతున్నారు. ఆహా! ఆ వెనకాల భరద్వాజాశ్రమము కాబోలు ! ఆ చిత్రకూటపు సానువుల్లో చీకట్లు కమ్ముతున్నాయి .... ..... అదుగో సీతమ్మ .... అదుగో లక్ష్మణ స్వామి! ..... అక్కడే

శ్రీరాములూ ఉంటారు. ఆహా! చిత్రకూట శిఖరం మీద అచలస్తంభంలాగ నిలబడి, నా స్వామి వెనక్కి తిరిగి చూస్తున్నాడు! ... రామచంద్రా! (బిగ్గరగా అరుస్తాడు)

**శ్రీరాముడు** : (మేఘగర్జనలాగ) గుహా !

కవి

*మసక మసక సందె – ఉసురుసు రసుగాలి –*
*గంగ జాలి మ్రోత – బెంగవలన*
*డిల్లవడిన పడవ – అల్లన నిలుచుండు*
*ఆ గుహుండు పదియు నాలుగేండ్లు !*

పాత్రలు

కథల కామశాస్త్రి
పాటల కోటయ్య
సుబ్బయ్య
సూరమ్మ
లచ్చమ్మ
ఇతర యాత్రికులు

# శివక్షేత్రయాత్ర

(దగ్గరగా స్వర్ణముఖి నీటి సవ్వడి. కాస్త దూరాన జనం కలకలం. ఒక పిల్లి ఏడుపులాగ, ఒక స్త్రీ కేకలాగ. మరీ దూరాన సన్నాయిపాడే శివకీర్తన. దగ్గరగా – మెల్లగా ప్రారంభమై సమీపించే ఈ క్రింది పాట)

తెల్లవారక మున్నె కళ్లు తెరిచీ – కళ్లు తెరిచీ –
కళ్లు తెరవకమున్నె ఒళ్లు విరిచీ – ఒళ్లు మరిచీ–
పరమ శివు కీర్తించు మరిమరీ మరిమరీ
మన స్వర్ణముఖరీ ! ఈ స్వర్ణముఖరీ !

మా అయ్య ఆడుగు తామర నిండి పారలేటి
మకరందలహరి మన స్వర్ణముఖరి –
మన స్వర్ణముఖరీ ! ఈ స్వర్ణముఖరీ !

జ్ఞానప్రసూనాంబ చల్లనౌ మది కరిగి
కాన కోనా పారలి కరుణాసుధాఝరి
మన స్వర్ణముఖరీ ! ఈ స్వర్ణముఖరీ !

కామశాస్త్రి : రండింక గుడికి వెడదాం. సుబ్బయ్యా– సూరమ్మా– నాగప్పా – అందరూ. ఆ పిల్ల నెత్తుకో సుబ్బయ్యా! మూట నువ్వు పట్టుకో అమ్మా! (నవ్వు) హుఁ! పిల్లా

జెల్లా, మూటా ముల్లే యాత్ర ముగిసేదాకా తప్పదుగదా! నువ్వూ రా కోటాయ్!

మారెమ్మ : కథల కామశాస్త్రిగారూ, పాటల కోటయ్యా రాకపోతే, ఏమయ్యేదో మన పని?

లచ్చమ్మ : కాళ్లీడ్చుకుంటూ, యాత్ర చెయ్యలేక –

కామశాస్త్రి : (నవ్వు) యాత్రికుల్ని నడిపే కాలు పాట; దారిబత్తెం కథ.

కోటయ్య : కత ఊత, పాట ఊపు (రాగాలాపన)

సుబ్బయ్య : అదుగో మొదలెడుతున్నాడు.

కోటయ్య : *ఏటి కయా బాబయా !*

*కోటయ మా టినరయా !*
*కాశీ రామేశ్వరాలు*
*కాళ్ళీడుసు కెళ్ళటం?* *॥ఏటి॥*
*సెయ్యేత్తామంటే, సీ*
*సెయిలం వారిగుంటే,*
*కూకున్నా సోటి కొచ్చి*
*కోటప్పా గుడి వుంటే,*
*రమ్మంటే కాళహస్తి*
*గుమ్మంకాడే వుంటే !* *॥ ఏటి॥*

సుబ్బయ్య : అయితే మరి నువ్వెందుకు వస్తున్నావు కోటయ్యా?

కోటయ్య : అయితే, మనం యెల్తున్నామా యియ్యాల? అయ్యన్నీ మన కాడ కొస్తున్నాయా? ఒక్క పాలే, యిక్కడుండి ఆ సోట్లన్నీ ఎలా సూడగలం ఇయాల- అవన్నీ మనకాడకే రాకపోతే ? కామసాస్త్రుల్లు గారు సెప్పారుగదా – ఆ డెవడో లాగ్, కాలికి పసరూ ఆకూ పూసుకొని అయన్నీ తిరిగొచ్చాడు, అలా మనం సేయాలి.

కామశాస్త్రి : భేషైన మాటన్నాడు కోటయ్య. కాని మనస్సుకి ఆ నిలకడా, ఆ ధ్యాసా ఉండాలి. ఇహ గుడి కెళ్ళేలోగా శ్రీకాళహస్తీశ్వరుని కథ చెప్పనా మరి?

గొంతులు : చెప్పండి!

సుబ్బయ్య : మొదటిక్కడ అడవిలో ఒక లింగం ఉండేదట కదండీ? ఆ లింగానికి –

మరో గొంతు : ఎండ తగలకుండా గూడుకట్టి సాలెపురుగూ –

వేరొక గొంతు : పడగలో రత్నాలు హారతులిచ్చి పామూ –

ఇంకో గొంతు : తొండంతో నీళ్లూ ఆకులూ పళ్లూ తెచ్చి అర్పించి ఏనుగూ –

కోటయ్య : కళ్ళు రెండూ ఊడబెరికి, కన్నతండ్రికి కానుక లిచ్చి చెంచు కన్నప్పా -

కామశాస్త్రి : కైవల్యం పొందారని మన మందరం ఎరుగుదుం. అంటే ఏమిటి? కోటప్పా! నువ్వు వినాలి. అంటే, పురుగులాంటి దుర్బలుడూ, పాములాంటి కుటిలుడూ, ఏనుగులాంటి మత్తుడూ, బోయలాంటి మూర్ఖుడూ కూడా, చివరకు, మనస్సులో, ఆ మహాదేవుణ్ణే ఉంచుకొని, ఆ ప్రభువునే నమ్ముకొని, ఆ తండ్రి పాదాలనే పట్టుకొని వదలకపోతే -

కోటయ్య : మోచ్చం వత్తుం దన్నమాట!

కామశాస్త్రి : ఆ! తప్పకుండా!

గొంతులు : భేష్ ! ఆహా! బాగుంది బాగుంది! బాగా చెప్పారు శాస్తుర్లు గారు.

కామశాస్త్రి :

అంచేత -

కొన్ని గొంతుకలు : *శివ శివ శివ అనరాదా?*

*శివనామము చేదా?*

*శివపాదము మీదా - నీ*
*శిరసు నుంచరాదా ?*

భవసాగర మీదా - దు
ర్భర వేదన కాదా ?

కరుణాళుడు కాదా - ప్రభు
చరణధూళి పడరాదా?

హర హర హర అంటే - మన
కరువు తీరిపోదా ?

కరి పురుగూ పాముబోయ
మొర లిడితే వినలేదా ?

కైలాసము దిగి వచ్చి
కైవల్యము ఇడ లేదా ?

మదనాంతకు మీద - నీ
మన సెన్నడు పోదా ?

మమకారపు తెర స్వామిని
మనసారా కననీదా ?

(ఘంటాధ్వని- శంఖధ్వని - జనం కోలాహలం. ఓం నమశ్శివాయ అనే మంత్రపాఠం వినబడాలి)

కామశాస్త్రి : దేవళం దగ్గరకు వస్తున్నాం. ఇక్కడ ఉండే పరమశివుడు పంచ మహాలింగాల్లో ఒకడు.

సుబ్బయ్య : మిగిలినవా రెక్కడున్నారు?

కామశాస్త్రి : ఈ శ్రీ కాళహస్తిలో ఇది వాయులింగం. జంబుకేశ్వరంలో జలలింగం. చిదంబరంలో ఆకాశలింగం. తిరువన్నామలైలో జ్యోతిర్లింగం. సాక్షాత్తూ ఆ కంచిలో పృథ్వీలింగమున్నూ. ఇక్కడ అమ్మవారి పేరు జ్ఞానప్రసూనాంబ, ఇహ రండి లోపలికి, శివకీర్తన చేస్తూ ఈ మందిలో కలిసిపోదాం.

(భజన పాట)

*హర హర హర ! హర హర హర !*
*హర హర హర ! శివ శంకర !*
*శంకర ! భక్త వశంకర !*
*జ్ఞానప్రసవ వాంబా వర !*
*హర పురహర ! స్మరఘస్మర !*
*కరధృత భీకర కర్పర !*
*కటకీకృత కాకోదర !*
*కాళహస్తిపురీవరా !*

(పాట నెమ్మదిగా కరిగిపోతుంది)

★★★

కామశాస్త్రి : కనక రకరకాలచోట్ల భగవంతుడు ఆలయం కట్టుకున్నాడు.

సుబ్బయ్య : ఆయనే కట్టుకున్నాడా? ఆ గుళ్ళు మనం కట్టామా?

కామశాస్త్రి : కొన్నాయన కట్టుకున్నాడు. కొన్ని చచ్చు మనుషులం

కట్టాం. ఆయనే కట్టుకున్నాడూ అంటే, ఆయన యెడల చలించనిదీ. గాఢమైనదీ, అహోరాత్రాలు వదలనిదీ అయిన భక్తిగల శిల్పులు కట్టినవి అన్నమాట. ఆయన కట్టుకున్న ఆలయాలు చూస్తేనే మన బ్రతుకులు పులకించిపోతాయి. మనం కట్టినవి చూస్తే మన మనసులాగ శూన్యంగా కనిపిస్తాయి. అంటే, కట్టిన వారినిబట్టి ఉంటుంది దేవమందిర ప్రభావమన్నమాట! ఇహ, ఏటి ఒడ్డున. కానలోనూ కోనలోనూ, కొండ కొమ్మునా కొలను గట్టునా. ఇలాంటిచోట ఇలా కట్టుకున్నాడు ఆలయాలు. అయితే, ఆలాగ అక్కడే ఎందుకు కట్టుకున్నాడయ్యా అని అడగవేం కోటయ్యా?

కోటయ్య : సిత్తం. అలాగ, అక్కడే, ఎందుకు కట్టుకున్నాడయా!

కామశాస్త్రి : ఆ! కారణా లివి. నాకు తోచినవి చెప్తా. (జాలిగా) ఒకటిః బ్రతుకంతా నలిగిపోయి, ఏవో చాలా బాధలుపడిన మానవుని కన్నీటి చుక్కలు పడిన పవిత్రమైన స్థలమై ఉండవచ్చు. న్యాయంకోసం నీతికోసం ఒక మానవోత్తముడు ప్రాణరక్తం చిందించినచోటు కావచ్చు. అలాటిచోటు భగవంతునికి ప్రియం. రెండు : చల్లగా శాంతంగా ఉంటుంది అక్కడ. సందడి ఉన్నచోట మనస్సు పైకి పరుగెత్తుతుంది. చల్లని చోట విజనస్థలంలో మనస్సు లోపలికి వెడుతుంది. మన అంతరంగం

భగవంతుని గర్భగుడి. మూడు : అక్కడ ఎవరో మహానుభావుడు తపస్సు చేసి ఉండవచ్చు.

సుబ్బయ్య : ఆ శ్రీశైలంలో అర్జునుడు మల్లెపువ్వులతో పరమశివుణ్ణి అర్చించాట్ట! అందువల్లనే అక్కడ వెలిసిన దేవుడికి మల్లికార్జునుడు అనే పేరు వచ్చింది - అని చెప్తారు.

కామశాస్త్రి : ఇంకా ఏవో కథలున్నాయి. అమ్మవారు భ్రమరాంబ. మన భరతదేశంలో ఉన్న అష్టాదశ శక్తులలో ఈ దేవి ఒకరు. ఈమెకీ పేరు ఎందు కొచ్చిందో కొన్ని కథలున్నాయి. భ్రమర మంటే తుమ్మెద గదా!

కోటయ్య : హద్దదీ! అలా సెప్పాలి.

కామశాస్త్రి : ఆ దేవి మల్లికార్జునుని హృదయంలోని తేనెలను త్రాగుతుంది గనక ఆ పేరు వచ్చిందని మన మనుకోవచ్చు.

కోటయ్య : ఉహూ! దేవుడి పాదాల్లేవండీ! అటేసుట్టూ మూగి పోయే తుమ్మెదలం మనం - అని సెప్పారుగదా మీరు! మనకు భ్రమరాంబ తల్లి అన్నమాట! అంబ అంటే తల్లికాదండీ సాస్త్రుర్లుగారూ?

కామశాస్త్రి : అవును.

యాత్రికులు : అదిగో శ్రీశైలం ! ఆకాశంలోకి ! .....
అల్లదిగో శ్రీశైలం !
అదియేనా శ్రీశైలం ?
మల్లికార్జునుడు కాపురముండే
ఇల్లిదియేనా శ్రీశైలం !

సురల దొరల మణి కిరీటములలో
మెరవు లడుగులకు హారతు లంట!
ఘనులౌ భక్తులు అర్పించుకునే
మనవులు వినతులు కైవారములట !
ముక్కోటి ప్రమథు లిరుగడలా
మ్రొక్కుబడులు చెల్లింతురట !
కొండకొమ్ముపై దేవితోడ కొలు
వుండే దేవర జూచేదాకా
క్షణకాలము మన జాలం !
అదిగదిగో శ్రీశైలం –
దాక్కున్నా కాశీపట్నంలో
ఎక్కున్నా కైలాస పర్వతం –
అక్కడికే వెడదాం – హరా యని
ఒక్కొక మెట్టే కడదాం !
ఒక్క నిముష మిక వదలం – అయ్యను
పక్క నుండి యిక కదలం !

*హరోం హరోం హర ! హరోం హరోం హర !*
*అది గదిగో శ్రీశైలం !*

★★★

కోటయ్య : అబ్బ! కొండెక్కి కూకుంటే ఎలా బాబూ ఈ దేవుడు! సత్తున్నాం. కాళ్ళడిపోతున్నా యెక్కలేక!

సుబ్బయ్య : ఇందాకా నువ్వు పాడేవు కాదూ – కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళక్కర్లేదని !

కామశాస్త్రి : కొండమీద స్వామి కొలువున్నా డంటే ఏమిటి అర్థం? కోనలెక్కి, గుట్టలెక్కి, కోటి మెట్లెక్కి, మనం దివ్యసన్నిధికి వెళ్ళాలంటే అర్థ మేమిటర్రా? "ఒరేయ్! మానవుడా? మామూలు వస్తువు పొందాలంటేనే నువ్వెంతో శ్రమపడాలిగదా! ఆ మహాప్రభువును పొందాలంటే ఊరికే తమాషాట్రా? ఈ యాత్ర అంటే – పరమపదసోపానపటం ఆట అన్నమాట!" అని.

కోటయ్య : అంటే, తోవలో గోతులుంటాయి; పాదు లుంటాయి; పులు లుంటాయి.

కామశాస్త్రి : అంటే "రకరకాల అనుభవాలు వస్తాయి. మంచీ చెడ్డా, సుఖం దుఃఖం, అన్నిట్లో కాలిపోయి, బంగారంలాగు నయి, పరిపక్వమంది, ఆరితేరి, తేరుకొని, నువ్వు మిగిలితే, విలబడితే, అప్పుడు భగవంతుడు కనబడతాడు" అని.

కోటయ్య : అంటే భగవంతుడు యిలా అంటున్నాడన్నమాట:- "ఒరే! కోటయ్యా! నేనిక్కడ కొండెక్కి కూకున్నా. రా నువ్వు నా దగ్గరకు, ఎలా వస్తావో చూస్తా. నీ పట్టుదల చూస్తా. అరే కోటయ్యా! నీకు నామీద ఉన్న యిష్టం కనిపెడతా" అని. అయితే, మనదగ్గిరికి రావాలని ఆ సామికి మరీ తొందర వుంటుంది - అంటాను. తండ్రి గనక - మనం వొక్క అడుగు ఆయనకేసి వేస్తే, ఆ అయ్య పది అడుగులు మనవైపు యేస్తాడు.

కామశాస్త్రి : అద్గదీ కోటయ్యా!

అందరూ : భేష్ ! బావుంది ! బావుంది!

సుబ్బయ్య : కానీ, ఏం ప్రభువండీ! పామూ పురుగూ దగ్గరకుకూడా పరుగెత్తుకు వస్తాడు.

సూరమ్మ : పంతం వచ్చి పర్వతం మీద కెక్కి కూర్చోనూ కూర్చుంటాడు.

సుబ్బయ్య : చంద్రవంకా పెట్టుకుంటాడు.

సూరమ్మ : సర్పాలూ చుట్టుకుంటాడు.

కామశాస్త్రి : అంచేతే, భక్తుడేమన్నాడు పాపం - ఉల్లాసంగా, చనువుగా !

ఎందుకయా సాంబశివా!
ఎవరు నీకు చెప్పారయ !
ఈ అల్లరి చేతలూ –
ఈ బూడిద పూతలూ ! ॥ఎందు॥
అలలతోటి గంగ బట్టి
తలపాగా చుట్టి –
నెలవంక అనే మల్లెను
కలికితురాయిగ పెట్టి ॥ ఎందు॥
తోలుకట్టి పటకాగా,
కాలాహిని కుట్టి
కేల త్రిశూలం పట్టి
ఫాలమందు కీల పెట్టి ॥ఎందు॥
రుద్రుడవో – కారుణ్య స
ముద్రుడవో యేమో !
ఎందుకయా ఈ దాసుని
కంద వయా దయామయా ! ॥ఎందు॥

**కామశాస్త్రి** : ఆ! ఆలయం దగ్గరకు వచ్చాం. జనం తొక్కిడి ఎక్కువగా ఉంది. అందరికీ ఒక్కసారే ఎలా దర్శన మిస్తాడో ఆ ప్రభువు ! చిత్రం ! కళ్ళు చెదరకుండా చూడండి!

(ఘంటా–శంఖధ్వని– ఓం నమశ్శివాయ–కలకలం)

*హర హర హర ! హర హర హర !*
*శంకర ! భక్తవశంకర !*
*దరహసితానన సుందర !*
*రజత శిలోచ్ఛ్రయ మందిర!*
*హర హర ! సుర గంగాధర !*
*హర ! హాలాహల కంధర !*
*జటారూఢ చంద్రాంకుర!*
*నిటాలాగ్ని నిష్ఠుర హర !*
*మోహన లోకావన భవ*
*కానన పటు దావ దహన !*
*భ్రమరాంబా చిత్త భవన !*
*పావన పావన ! హర హర !*

(పాట కరగిపోతుంది. వెంటనే మహానది ప్రవహిస్తున్న గంగం. పడవ నడిచిన చప్పుడు వినబడాలి.)

కామశాస్త్రి : అదుగో! అది పట్టిసం. వీరభద్రేశ్వరస్వామి వీడు. ఇటు–ఇది పుండరీకాద్రి. మార్కండేయ ప్రభువు నెలవు. అల్లదిగో – దూరాన కుమారారామం; చాళుక్య భీమేశ్వరుల కొలువుకూటం – ఆహా! ఆపైన, కుక్కుటేశ్వరం – అదే అదే ! నా అయ్య, నా ఇలవేలుపు, నా తల్లి రాజరాజేశ్వరీదేవితో ఓలగం

ఉన్నా డక్కడ. ఈ వైపు పలివెల. అటు చూడండయ్యా- ఆ పక్క! మందేశ్వరం. ఇటు సంపర. అటు కోటిపల్లి సోమేశ్వరం. ఓహో ! ఓహో ! ఈ సప్తగోదావరీ సీమకంటె పవిత్రమూ మనోహరమూ అయిన స్థలం ప్రపంచంలో ఉందరా? అందుకే కాశీనుంచి వెడలగొట్టబడిన వేదవ్యాసమహర్షి, ఈ దివ్యసీమకు వచ్చి, మనసు చల్లబరచుకున్నాడు. సుబ్బన్నా! నాగమ్మా! అయ్యా కోటయ్యా! ఇక్కడ దక్షారామ భీమేశ్వరుని సందర్శించాక, నా తల్లి రాజరాజేశ్వరీదేవి చరణసన్నిధికి నేను వెళ్ళి పోతాను ... మీ త్రోవన మీరు పొండి ! ... ఆహా! ఈ నావ, ఎంత నమ్మకంగా కదులుతోంది- గోదావరమ్మ అంకంమీద !

*"గోదావరి గోదావరి*
*గోదావరి" అంచు పల్కు గుణవంతులకున్*
*గోదావరి తల్లీ! సం*
*పాదింతు గదమ్మ నీవు భవ్యశుభంబుల్ !*

ఆహా

*అదె మా స్వామి, సుధారసోద్భవుడు,*
*దక్షారామ భీమేశు, డ*
*భ్యుదయం బొంది ప్రతిష్ఠ గైకొనెడు*
*అంభోరాశి తీరంబునన్,*

ముక్కోటి దేవతల నేతరా -
ముల్లోకముల కిష్టదాతరా -
వెలిబూది పూతరా - నలవిసము మేతరా -
హరహరా హరహరా హరహరా !

ఓహో రథీకృత క్ష్మామండలా -
ఆహా సరీసృప శ్రీ కుండలా-
నీహార గిరి నందినీ హరి హృదయ ధన
పాటచ్చరా హరా ! హర హరా! హర హరా!

కామశాస్త్రి : ముందు ఈ భీమగుండంలో స్నానం చేద్దాం. ఈ సరస్సు మనకు ఉత్తరు వీయాలి. లోపలికి పోవటానికి. తర్వాత మనం ముందు మాణిక్యాంబను దర్శించి, మన మనవులు చెప్పుకుందాం. అమ్మ మనసు మహా మెత్తన - వెన్న కన్న, వెన్నలకన్న, క్రొన్ననల కన్న! మన అపరాధాలన్నీ సర్ది - తల్లి కదూ -ప్రభువుతో మన మాట చెప్తుతుంది మాణిక్యాంబ! నడవండి!

(ఘంటావాదం - శంఖారావం - పంచాక్షరీ మంత్రపఠనం)

